విజయ అనుబంధం

# అనుభవ మంటపం

డా॥ ముదిగొండ శివప్రసాద్

(మూడవ భాగం)

'విజయ' అనుబంధ మాలికలో

వెలువడ్డ ఇరవై ఏడవ నవల

విజయ

౩౦. ధనలక్ష్మీ కాలనీ

మద్రాసు-౨౬

147

విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 30
July 1978
'ANUBHAVA MANTAPAM' (III nd Part)
BY Dr. MUDIGONDA SIVAPRASAD

వెల: చెల్లింపలేనిది.

(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)



ప్రింటర్స్:
విజయా గ్రాఫిక్స్,
8- ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

178

# అనుభవ మంటపం

## (మూడవ భాగం)

"శీలా! నేను నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను."

"...................."

అనుభవ మంటపపు గోపురాలపై విశ్రమించేందుకు రాత్రి శకుంతాలు మొగలి పొదల మీదుగా కదలి తరువుల వాలుగా రివ్వున ఎగురుతూ పోయాయి.

శీలవంతుడు నవ్వాడు.

ఆ నవ్వు వెన్నెలతో బాటు మెరిసింది.

"అమ్మాయిగారూ! కొన్ని కొన్ని భావాలు వ్యక్తీకరించడానికి కష్టమని అంటామే- అందులో ఇదొక భావం. మనసులో నుండి పుట్టిన భావం మాటగా మారడానికి సంస్కారం, సమాజం, సమకాలీన పరిస్థితులు- ఇలా ఎన్నో తెరలు అడ్డం వస్తాయి...."

"అనుభవమంటప సభ్యులకు కూడా ఆ తెరలున్నాయా?"

"లేవు- కాని కల్యాణనగర ప్రజలకు ఉన్నాయి."

"మనకు గురువు బసవన్నా? కల్యాణ నగరంలోని మిగిలిన ప్రజలా?" లావణ్య ప్రశ్నించింది.

"బసవన్నే! కాని బసవన్న ఆదర్శం కూడా కల్యాణ నగర ప్రజల కోసమూ- సమస్త మానవాళి కోసమూ."

"అయితే శీలా! ఆ ఆదర్శానికి మనం తొలి ఉదాహరణగా ఎందుకు కాకూడదు?"

శీలవంతుడు చిరునవ్వుతో "మన మా పరీక్షకు నిలువగలమా?" అన్నాడు.

179

"పరీక్షకు నిలువలేనిది సత్యాచరణ ఎలా అవుతుంది?"

"అమ్మాయిగారూ! మీరు అందుకు సిద్ధంగా ఉన్నారా అని నేను ప్రశ్నిస్తున్నాను. క్షణికోద్రేకంతో తీసుకోవలసిన నిర్ణయం కాదిది- మీ తండ్రిగారూ, మీరు పుట్టి పెరిగిన వాతావరణమూ, మీ జీవితపు అలవాట్లూ, అన్నింటినీ దృష్టిలో ఉంచుకుని ఆలోచించండి."

లావణ్య నవ్వి "ఓహో! అయితే నా గూర్చి మాత్రమేనన్న మాట నీ ఆలోచన మొత్తమూ...." అని ఒక్క క్షణం ఆగి "నా మనసులోని మాట మా నాయనగారికి తెలియపరిచాను."

శీలవంతుడు తబ్బిబ్బైనాడు.

"అమ్మాయిగారూ!"

"అవును- మా నాయనగారు నేను చెప్పినదంతా ప్రశాంతంగా విన్నారు."

'అమ్మాయీ! నీవు యుక్తాయుక్త విచక్షణ తెలిసినదానివి. అనుభవ మంటప సభ్యురాలివిగా కూడా చేరావు. అలాంటప్పుడు నీ నిర్ణయాలూ ఆదర్శాలూ తొందరపాటుతో కూడినవని నేను అనుకోను.' అన్నారాయన. అంతే."

శీలవంతుడు మాట్లాడలేదు.

ఆకాశమనే పురంధ్రీమణి వినీల కుంతలాలలో చూడామణి వలె వెలుగుతున్నాడు చంద్రుడు. ఆమె ముంగురులవలె మేఘాలు కదలాడుతున్నాయి. ముంగురులను సవరించుకొన్నది లావణ్యవతి.

ఇరువురూ కొన్ని క్షణాలు నిశ్శబ్దంతో మాట్లాడుకున్నారు.

"శీలా!"

"లావణ్యా!"

"మనది క్షణికమైన తొందరపాటుతో తీసుకున్న నిర్ణయం కాదనీ కేవలం శారీర కాకర్షణలకు లోనై జరిపే పొరపాటు కాదని కాలంలో మనం పరీక్షకు నెగ్గి నిరూపించాలి."

లావణ్య శీలవంతుని దగ్గరకు జరిగింది.

శీలవంతుడు లావణ్యను స్పృశించాడు.

"లావణ్యా!"

"శీలా!"

"అయితే మన మీ ప్రమాణాన్ని అనుభవమంటప సాక్షిగా సంయుక్తంగా చేద్దాము.

"నీవూ,

నేనూ-

వ్యక్తులుగా కాక శక్తులమై, స్త్రీ పురుషులుగా కాక ఒకే ఆదర్శ జ్వాలకు రెండు రేకులమై,

శరీరవాంఛ సంబంధమైన కామం కాక,

అనుభవ మంటప సిద్ధాంతాలకు సాకార ప్రతీకలమై,

ప్రతిమలమై,

ప్రతి రూపాలమై,

మనసులో మనసుగా,

శరీరంలో శరీరంగా,

బుద్ధిలో బుద్ధిగా,

ఆత్మలో ఆత్మగా,

కలిసి మెలిసి

రాబోయే నూతన మహోదయ కాంతి కిరణాలమై, కులమునూ మతమునూ భౌతికమైన ఎల్లలనూ కాలాన్నీ అతిక్రమించి,

విశ్వ మానవతా వాదపు శంఖారావంలో రెండు నాదాలమై

విశ్వప్రేమా విపంచిలో పలికిన పల్లవిలోని రెండు అక్షరాలమై,

శాశ్వతంగా

సనాతనంగా

వేదాలకు నిజమైన అర్థాలమై, ఉపనిషత్తులకు యథార్థ వ్యాఖ్యానాలమై బసవన్నగారికి ఆదర్శ శిష్యులమై,

యుగ నిర్మాతలమై

కాలమనే కత్తి అంచు మీద అసిధారావ్రతంగా నడువగల ఆత్మ శక్తితో-

ఇరువురమూ, ఈ తోటలోని పుష్పాలూ- కోటలోని బసవన్నా, అనుభవ మంటపమూ, పంచభూతాలూ, పరమేశ్వరుడూ సాక్షిగా ప్రమాణం చేస్తున్నాము."

శీలవంతుని ప్రమాణ వాక్యాలు లావణ్యవతి పలికింది.

లావణ్యవతి కంకణ కింకిణీ స్వనాలు రవళిస్తూ మాంజిష్ట రాగాలతో శోభించే తన కుడి చేయిని ముందుకు చాచింది.

శీలవంతుడు నిరంతర శివపూజా కార్యం చేత పవిత్రమైన తన దక్షిణ హస్తంతో లావణ్యవతి చేతిని గట్టిగా పట్టుకున్నాడు. నునులేత శిరీష కుసుమాల రేకుల వంటి వేళ్ళతో మారేడు ఆకుల వంటి శీలవంతుని చేతి వేళ్ళను పెనవేసింది.

ఉన్నట్టుండి మొగలి పొదలో సుడిగాలి రేగింది.

దూరాన గుడిలో గంటలను ఎవరో వెర్రెత్తి నట్లు ఆగకుండా మోగిస్తున్నారు-

గణగణా గణగణా గణగణా గణగణా

మొగలి రేకులలోమిణ్ణాగులు కదిలాయి.

వ్యోమ కేశుడైన శివుని మెడలో నాగాభరణాలవలె చంద్ర కిరణాలు మెలికలు పడ్డాయి.

చేయీ చేయీ కలిపి లావణ్యవతీ శీలవంతులు కదళీ వనం నుండి కదిలారు.

మన్నూ మిన్నూ క్షితిజ రేఖల వద్ద కలిసిన చోట పరస్పరం రాచుకొని రగిలిన అగ్నివలె దూరాలతీరాలలో ఆకాశం ఎర్రబడి ఉరిమింది.

# 22

క్రలకేత బ్రహ్మయ్యా, శీలవంతుడూ వచ్చి ఏకాంతంగా బసవేశ్వరుణ్ణి కలిశారు. అప్పుడే శివపూజ ముగించి ప్రసాద పుష్పాలు శిరముపై దాల్చి భస్మ రేఖలతో ద్వితీయ శివుని వలె బసవన్న ఇష్ట లింగార్చనా మందిరం నుండి వెలుపలికి వచ్చాడు. ఇరువురూ తమ గురువు పాదాలకు శరణు చేశారు.

బసవన్న ఈత ఆకులతో అల్లిన చాపను కింద పరిచి కూర్చున్నాడు. సూర్యుడు ముంగిలిలో బంగారాన్ని పండిస్తున్నాడు అరుణారుణ కిరణాలతో.

బ్రహ్మయ్యా, శీలవంతుడూ సరసన కూర్చున్నారు.

అప్పుడు బ్రహ్మయ్య ఇలా అన్నాడు-

"నేనూ, శీలవంతుడూ కలిసి చాలా వరకు రహస్య భేదనం చేశాము. మన అనుమానాలు నిజమైనాయి. భైరవుని కోన వద్ద వట వృక్ష మందిరం పశ్చిమ చాళుక్యులలో ఎవరో ప్రాచీన రాజు కావాలని కట్టించిన రహస్య మందిరం. దాని రహస్యం కాల మారి బిజ్జలునికి గాని ఇతర సేనా విభాగానికి గాని తెలిసినట్లు లేదు.

అయితే పిశాచాలకు కూడా తెలియని రహస్య మార్గం ఒకటి బౌద్ధ స్తూప శిఖరం పక్క దిబ్బ వెనుక గుహాంతర్భాగం నుండి నంది సముద్రం చెరువు మధ్యకు వుంది. గుహ మార్గం ఎత్తులో ఉండటం వల్ల చెరువులో నీరు గుహలోకి వెళ్ళవు. దాని నిర్మాణం లోపల అలా వుంది" అని తన సాహస యాత్ర మొత్తం వివరించాడు కలకేత బ్రహ్మయ్య.

శిథిల భవన సమీపంలో ఒక పామును, గుహలో మరొక పామును చంపానని బ్రహ్మయ్య చెప్పినప్పుడు మాత్రం బసవేశ్వరుని ముఖంపై దయార్ద్ర రేఖలు గోచరించాయి. మరుక్షణమే ఆయన నోటి నుండి ఈ గీతం వచ్చింది.

"ఏమీ చిత్రం ఈలోకపు కథ
సత్యేతరమగు జీవిత గాములు
రాతి పాము నర్చించెడి పెద్దలు
జాతి నాగులను చంపి వేసెదరు,
తినెడి జంగమును "చను-చను" మందును
తినని లింగమును "తిను-తిను" మందురు
ఏమీ చిత్రం ఈలోకపు కథ...."

గంగాంబిక లోపలి నుండి విభూతి విడెము-సీతాఫలాలు తెచ్చి భక్తుల కిచ్చింది.

"మీరు తీసుకోరా, గురువర్యా!" అన్నాడు కలకేత

బ్రహ్మయ్య బసవన్నను.

"లేదు, వారు చాలా దినాలుగా నిరాహార వ్రతాన్ని అవలంబిస్తున్నారు-" అన్నది గంగాంబిక.

"ఎందువల్ల?"

"మదేలు మాచయ్య వల్ల. భూకైలాస మనదగ్గ కల్యాణ నగరంలో రక్తం చిందిందనీ, ఆ పాప పరిహారార్థం మీ గురువుగారు అంతర్ముఖులై ఆహారాన్ని వదిలారు" అని గంగాంబిక నవ్వుతూ చెప్పింది.

గంగాంబికను చూడగానే వాకిట కట్టి వున్న నందినీ ధేనువు 'అంబా' అని అరిచింది.

"శీలవంతా!" వాత్సల్యంతో ఆవు తన దూడను చూచినట్లు గంగాంబ శీలవంతుని వంక చూచింది.

"అమ్మా!"

"ఎంతసేపూ ఈ ముసుగు మనిషి-రహస్య భేదనాలేనా? పెళ్ళి ప్రయత్నాలేమైనా వున్నాయా?"

"ఎవరికీ! మన శీలవంతునికా వివాహం?" అన్నాడు బసవన్న ఆశ్చర్యంగా.

"కూడల సంగమేశ్వరా- తండ్రీ! ఏమి వింత! అయ్యగారికి ఇసుమంత కూడా తెలియదన్న మాట?"

"అంటే....?" అని చిరునవ్వుతో ప్రశ్నార్థకంగా చూచాడు బసవన్న.

"మన శీలవంతుడు...."

"ఊం-శీలవంతుడు...."

"చెప్పనా?" అని శీలవంతుని వైపు చూచింది గంగాంబ. శీలవంతుడు తల వంచుకున్నాడు.

"శీలవంతుడేమి చెపుతాడు-నేను చెపుతాను వినండి గురుదేవా! శీలవంతుడూ-లావణ్యవతీ...." అని కలకేత బ్రహ్మయ్య ఆగాడు.

సూర్యుని కిరణాల వేడి మరికొంత ఎక్కువైంది.

మరు క్షణమే బసవన్న గంభీరముద్ర వహించి కన్నులు మూసుకున్నాడు.

సూర్యుడు-చంద్రుడు అనే రెండు నేత్రాలు ముడుచుకొని ఆత్మావలోకనంలో హిమశృంగంపై తపస్సు చేస్తున్న పరమ శివుని వలె క్షణకాలం అనిపించింది బసవనమూర్తి-శీలవంత బ్రహ్మయ్యలకు.

ఇక ఏమి మాట్లాడాలో తెలియక శీలవంతుడు బ్రహ్మయ్య మౌనం వహించారు.

ఇంతలో బసవన్న నిత్యాన్న దానమూ మహేశ్వర గణార్చనలూ నిర్వహించే పరుసకట్టి మందిరం నుండి బసవన్నను ప్రభాతార్చనల కోసం పిలుచుకొని పోవడానికై భక్తులు కొందరు వచ్చారు నామ సంకీర్తనం చేసుకొంటూ!

బసవన్న కన్నులు తెరిచాడు.

చేతితో శీలవంతుణ్ణి ఆదరంగా నిమిరాడు.

నందినీ ధేనువు మళ్ళీ 'అంబా' రవం చేసింది.

"సరే! మిగిలిన విషయాలు తర్వాత మాట్లాడుదాము. శీలవంతా! నీ పరిశోధనలో తొందరపడి మాత్రం ఎవరిని బంధించకు సుమా!

మనం బంధించవలసింది హింసనే కాని హింసాత్మకుణ్ణి కాదు.

మన కీ భూమిపై ఎవ్వడూ శత్రువు లేడు. శత్రుమిత్ర భావాలు సాపేక్షాలు.

హింస, క్రోధమూ- రెండూ చీకటి భావాలు. వాటికై కత్తిని మలినపరచడంలో మానవ చరిత్ర మొత్తం రక్తసిక్తమైంది.

ఆ స్థానంలో అహింస-శాంతి అనే రెండు పరంజ్యోతులు వెలింగించాలి. ఇదే మనమతం, మన ఉద్యమం. తెలిసిందా?"

"తెలిసింది" అని బ్రహ్మయ్యా శీలవంతుడూ లేచారు.

"మీ రొకసారి లోపలికి వస్తారా?" అన్నది గంగాంబిక. బసవన్న లోపలికి వెళ్ళాడు.

"అదేమిటీ? శీలవంతుని వివాహం గూర్చి మీరు ఒక్క మాట కూడా ఆ బిడ్డడితో అనలేదు. అనుభవమంటపంలోని సభ్యులంతా అప్పుడే అభినందనలు చెపుతూంటే...."

"గంగా! పేరుకు తగ్గట్లే నీవు జీవన జాహ్నవివి. సమస్త అపవిత్రతలనూ, కల్మషాన్ని, కశ్మలాన్ని, భక్తుల పాపాలను నీలో లీనం చేసుకొని సమాజానికి పుణ్యాన్ని ప్రదానం చేస్తావు.

మానవ సమాజం మొత్తమూ గంగవలె పావిత్ర్యం అయ్యే సుముహూర్తం మన యుగంలోనే చూడాలి గంగా!"

బసవన్న ఎవరినుద్దేశించి ఈ మాటలు అన్నాడో గంగాంబికకు అర్థం కాలేదు.

ఇక మారుమాట్లాడే సాహసంలేక ఊరుకున్నది.

బసవన్న అంగీ, శిరోలాంఛనము ధరించి తెల్లగుర్రంపై పరుస కట్టికు బయల్దేరాడు.

ఇలా వెళ్తుండగా త్రోవలో శివనాగుమయ్య కన్పించాడు.

బసవన్న గుర్రం దిగి శివనాగుమయ్యకు శరణు చేశాడు.

శివనాగుమయ్య "బసవా! భక్తికి సాకారదైవమా! నీవు నాకు శరణుచేస్తే నాకింక ముక్తి ఎక్కడిది?" అన్నాడు.

బసవన్న చిరునవ్వుతో శివనాగుమయ్యను తన గుర్రంపై ఎక్కించుకొని సంగమేశ్వర నగర్‌లోని ప్రజల స్థితిగతులూ, కుటీర పరిశ్రమల ఉత్పత్తి, వికాసాలూ, ఇటీవల కొత్తగా తలపెట్టిన పశు పక్షి వైద్యశాల విస్తరణ పథకం గూర్చి చర్చిస్తూ ముందుకు సాగాడు.

బసవన్న పరుస కట్టికు బయలుదేరాడని తెలియగానే నగరపు వీధులలో భక్తగణం హారతులతో తమ తమ ఇళ్ళముందు నిలబడి అర్చించి లోపలికి వెళ్ళుతున్నారు.

"పరుసకట్టి వద్ద భక్తగణం తక్కువగా ఉన్నారు" అన్నాడు శివనాగుమయ్య.

"ఎందువల్ల? నా భక్తిలో లోపమా?" అన్నాడు బసవన్న దిగ్భ్రాంతితో.

"లేదు- కల్యాణనగరం ఆర్థికంగా తమ నూతన నేతృత్వంతో స్వయం సమృద్ధమైంది. మన వస్త్రాలూ, చెప్పులూ, మృణ్మయ శిల్పాలు, కుమ్మర గుండయ్యగారి రంగుల బొమ్మలూ, మేదర చెన్నయ్యగారి చిత్ర విచిత్రాలంకరణలుగల పేటికలూ, బుట్టలూ పశ్చిమ దేశాలకూ, చీనీ, బ్రహ్మదేశాలకూ ఎగుమతి చేస్తున్నామిప్పుడు.

కాశ్మీర ప్రభువు మోళిగ మారయ్యగారు అడవినుండి చందనంకొట్టి తెస్తున్నారు. వారి ధర్మపత్ని వాటిని శివ పార్వతీ దుర్గా, భైరవ, పశుపతి విగ్రహాల కిందికి పలుస్తున్నది. త్రివిష్టపానికీ హిమాలయ పాదభూమిలోని పశుపతినాథుని నివాసమైన నేపాల రాజ్యానికి కూడా మన సంగమేశ్వర నగర్‌లోని వస్తువులు ఎగుమతి అవుతున్నాయి.''

“చాలా సంతోషం శివనాగుమయ్యా! ఇదంతా కుటీర పరిశ్రమల విషయంలో మీరు వహించిన శ్రద్ధకు ఫలితం.''

“ఇందులో నాదేముంది బసవదేవా!

‘కాయకమే కైలాసం’

దీనివల్ల ఇచ్చేవాడే కాని పుచ్చుకునేవాడు అరుదైనాడు మన నగరంలో.''

బసవన్న తృప్తిగా నవ్వి ‘సంగమేశ్వరా!’ అన్నాడు.

పరుస కట్టి వచ్చింది.

ఇద్దరూ అశ్వం దిగారు.

బసవన్న శివనాగుమయ్య ఇద్దరూ కలిసి గుర్రం దిగడం దూరం నుండి నారాయణాచార్యులు చూచాడు.

“ఓయ్! పల్లకీ ఆ పరుసకట్టి వీధినుండి రేణుకాచార్య మందిరం వీధిగా మహారాజ భవనానికి పోనీ'' అన్నాడు బోయీలతో.

“చిత్తం-చిత్తం'' అని బోయీలు పల్లకిని బసవన్నకు ఎదురు పడకుండా పక్కకు తప్పించి రేణుకాచార్య మందిరం వీధినుండి రాజభవనానికి చేర్చారు.

నారాయణాచార్యులు పల్లకీ దిగి రాజభవనం లోపలికి వెళ్ళాడు.

బిజ్జలుడు అప్పుడే పూజాదికాలు ముగించుకొని రత్నాసన మలంకరించి కొందరు రాయబారులతోనూ, ఉన్నతాధికారులతోనూ ముచ్చటిస్తున్నాడు.

“ఓహో! అభివాదనం రాజగురూ! రండి—రండి'' అని నారాయణాచార్యులకు స్వాగతం పలికి అభివందనం చేసి ఉచితాసనం చూపించాడు.

నారాయణాచార్యులు నిదానంగా కూర్చున్నాడు.

ప్రభువు వినతులూ, విజ్ఞప్తులూ, మంతనాలూ ముగించాడు. ఒకటి రెండు సార్లు రహస్య సంభాషణలకు మాత్రం అంతరంగిక మందిరంలోకి వెళ్ళి వచ్చాడు.

"ఆఁ....నారాయణగురూ! ఏమిటి నగర విశేషాలు?" అని కాస్త విశ్రాంతి లభించగానే నారాయణయ్యను ప్రశ్నించాడు బిజ్జలుడు.

"ప్రభూ! మీరు శైవులు, నేను రాజగురువును- వైష్ణవుణ్ణి. ఇది ప్రపంచ సామ్రాజ్యాలలోనే అపూర్వం. మీ మత సామరస్యానికి ప్రత్యక్షోదాహరణం. 'మణినా వలయం—వలయే నమణిః' అన్నట్లు మీ దయవల్ల మన ప్రజలూ, మన ప్రజల అనురాగం వల్ల మీరు పరస్పరం శోభిల్లుతున్నారు. గంగా యమునల వలె, నీరక్షీరాల వలె, బసవ- శివనాగుమయ్యల వలె...." అని ఆగాడు.

"ఏమిటీ? బసవన్నా- శివనాగుమయ్యా అంతటి మిత్రులా?"

"అదేమిటి ప్రభూ! తమకు తెలియనట్లే అడుగుతారు- ఇరువురూ కలిసి నూతన ఆర్థిక వ్యవస్థను నిర్మించారు. ఒకేచోట ఉంటూ, ఒకేచోట తింటూ ఒకే గుర్రంమీద ఊరేగుతున్నారు."

"అలాగా!" అన్నాడు బిజ్జలుడు సాలోచనగా.

"అయితే ఇదేమీ తప్పు కాదనుకోండి. సమాజంలో ఆర్థికంగా, సామాజికంగా. రాజకీయంగా వెనుకబడిన వర్ణాలను పైకి తీసుకురావాలన్నదే బసవన్నగారి ఏకైక సుందర స్వప్నం. నేడది ఫలించింది. ఘనీభవించింది. సంగమేశ్వర నగర్‌లో సాకారమై నిలిచింది. కాకుంటే గిట్టని- ఈ పురాతనాచారపరులు మాత్రం 'ఎంతైనా బ్రాహ్మణుడూ, మాలవాడూ కలిసి తిరగడమేమిటి? 'యథా రాజా తథా ప్రజా' అన్నట్లు ప్రధానమంత్రే వర్ణ సాంకర్యం చేస్తే మేమింక చాళుక్య రాజ్యం వదిలి వెళ్ళక తప్పదు' అంటున్నారు ప్రభూ!"

"ఔను- మేమీ ఆందోళన వార్తలు గమనించాము."

"రాజ్యంలో తైలపునికి నమ్మకస్థులైనవారు చాలా మంది వున్నారు. ఆ వర్గాలవారు మీపై ఎంత విశ్వాసం చూపుతున్నారన్న అంశంపై నా అనుమానాలు నా కున్నాయి."

"గురువర్యా! యధార్థం చెప్పారు. నేనే తైలపుణ్ణి బలవంతంగా కాకతీయ ప్రోలరాజుమీదికి యుద్ధానికి పంపి బందీ అయ్యేటట్లు చూసి చాళుక్య సామ్రాజ్యాన్ని ఆక్రమించుకున్నానని కూడా ప్రచారాలు చేస్తున్నారు. మా పూర్వీకులు మధ్య భారతం నుండి వచ్చారనీ మేము స్థానికులం కాదనీ కొందరు ప్రచారాలు చేస్తున్నారు."

"ఆ మాట అనడానికి నేను సాహసించలేదు. నేనూ ఈ పుకారు విన్నాను. అలాంటప్పుడు మన పాలితులలో బలమైన కొన్ని వర్గాలు ఇప్పుడు శత్రువులతో చేతులు కలిపితే ప్రమాదం కాదా?"

"అయితే ఏం చేద్దాము గురుదేవా! ఈ సాంప్రదాయవాదులను నిర్మూలిద్దామా?"

"అది మరీ ప్రమాదం. రక్తం చిందిందో- విప్లవమే! పైగా బసవన్న గారు మహామహుడే కాని ఆయన కింద చేరిన వారంతా నమ్మకస్థులని ఏమిటి ఆధారం? కాశ్మీర దేశం నుంచి మోళిగ మారయ్య కట్టెలు కొట్టుకోవడానికి కల్యాణ నగరం రావాలా?"

"అవును-నాకూ ఆ అనుమానాలు ఉన్నాయి. కాని దీనికి పరిష్కారమేమిటో తెలియడం లేదు. అనుభవమంటపం సభ్యులను మందలిస్తే రాజ్యంలోని శైవులంతా తిరుగుబాటు చేస్తారు"

"కాదంటే ఇప్పుడు సనాతనులూ, వైష్ణవులూ, బౌద్ధులూ, జైనులూ అందరూ కలిసేటట్లున్నారు. వీరందరూ ఒక్కొక్కరు ఒక్కొక్క కారణంతో అసంతృప్తులై వున్నారు."

"తమరు కాస్త ధైర్యం వహించి ఒక్కసారి బసవన్న గారిని...."

"ఆ! బసవన్నగారినీ?"

"బసవన్నగారిని కొంచెం, ఆ మాల మాదిగలతో కలిసి తిరగకూడదని మందలిస్తే....అంతే! అంతకన్నా ఇంకేమీ వద్దు. సమాజం చూచేటట్లు మరీ వీధుల్లో ఊరేగ వద్దని చెప్పండి.

నేటికి నేడు శివనాగుమయ్య, బసవన్నా ఒకే గుర్రం మీద ఊరేగుతుంటే నగర ప్రజలు మండిపడ్డారు. ఈ రాజ్యంలో ఇక పంటలు పండవని విప్రులు శపించారు.

ఇదంతా మనకు క్షేమకరం కాదు."

"జానాను-బసవన్నగారితో గట్టిగా మాట్లాడుతాను."

"అంతే! అంతకు మించి నా మాటలలో మరే అంతరార్థమూ లేదు. అలాగే చెన్నబసవన్నను షట్‌స్థల చక్రవర్తీ అని పిలువవద్దని చెప్పండి. 'చక్రవర్తి' శబ్దం ఎందుకో తమరూ రాయమురారిగారూ తప్ప అన్యులు-ఏ అర్థంలో ప్రయోగించినా అస్మదాదులం భరించ లేము. ఇంతకాలం మీ సేవలో తరించాము. తర్వాత రాయమురారి గారిని సేవిస్తూ తరించాలనే మా ఏకైక వాంఛితం."

"మీ అభిమానానికి కృతజ్ఞులం."

బిజ్జలుడు ఎడమచేత్తో ఎడమ మీసాన్ని ఒకసారి దువ్వు కున్నాడు.

ఇంతలో చీనాంబరం దాల్చి భూతిలకం పరివేష వస్త్రంగా దాల్చిన ఒక పరిచారిక బంగారు పళ్ళెరంలో రత్నాలు పొదిగిన పానపాత్రతో వచ్చి-

"ప్రభూ! తాము గో క్షీరం తాగే సమయమైంది" అని పాత్రను సుతారంగా వంగి వినయంగా అందించింది.

"జాను కదూ!" అని గోక్షీరాన్ని తీసుకోకుండా "నారాయణా చార్యా! తాము సేవించండి."

"ప్రభువులు—"

"ఇప్పుడే తెప్పిస్తాను-మళ్ళీ" అని పరిచారిక కళ్ళల్లోకి చూశాడు.

రాజాజ్ఞ అర్థం చేసుకుని గో క్షీరాన్ని నారాయణాచార్యులకు అందించి ప్రభువుల వారి కోసం మళ్ళీలోనికి వెళ్ళింది విలాసంగా నడుస్తూ.

నారాయణాచార్యులు గోక్షీరాన్ని కొంచెం చప్పరించాడు. "ప్ర....భూ....!" అన్నాడు తడబడుతూ, చేతిలోని పానపాత్ర జారిపోయింది.

నారాయణాచార్యులు ఆసనం మీద వెల్లికిలా పడిపోయాడు.

బిజ్జలుడు దిగ్భ్రాంతుడై 'ఎవరక్కడ' అని కేక వేశాడు. రక్షకభటులూ, పరిచారకులూ, చారికలూ వచ్చారు.

క్షణాలల్లో నారాయణాచార్యుల వారిని పరీక్షించారు వైద్యులు.

"ప్రభూ! పాలలో విషం కలుపబడి వుంది. ఇది హత్యా ప్రయత్నం" అని తేల్చారు వైద్యులు.

# 23

అనుభవ మంటపం!

శివ శరణులు, శరణురాండ్రూ ఆసీనులైనారు.

మధువరసు లేచి ఇలా ప్రసంగించాడు-

"శివపాదాంబుజ షట్పదులైన మహాభక్తగణముకు నా వినమ్ర శరణులు. ముందు వచ్చిన చెవులకంటే వెనుక వచ్చిన కొమ్ములు వాడి అంటారు. బసవన్నగారి నూతన సంస్కారణాత్మక భక్తిమతం నాకు చర్మమాంసాస్థగతమై ఆత్మలో తాదాత్మ్యమైంది. ఇది పూర్వ జన్మ సుకృతం.

ఏ సిద్ధాంతమైనా పుస్తకాలలో మస్తకాలలో ఉన్నంత వరకూ ఆది పండితుల పరిశోధనా మండలులలో చర్చించుకోవడానికీ, భక్త కూటములు కేవలం వినోద గానాలు చేసుకోవడానికి మాత్రమే పరిమిత మవుతుంది. హృదయంలోకి దిగినప్పుడు సిద్ధాంతం అర్థమవుతుంది. రసస్నిగ్ధ మవుతుంది. ఆచరణలోకి దిగినప్పుడు సాకార మవుతుంది. విజయాన్ని సాధిస్తుంది.

లావణ్యవతి, శీలవంతుల ప్రేమగాధ నాకు తెలియవచ్చింది. మన సిద్ధాంతం దృష్ట్యా ఇది మహాకార్యం. నేను పుట్టిన సమాజం దృష్ట్యా ఇది మహాపాపం.

అయితే ఇక్కడ అనులోమ, ప్రతిలోమ వివాహాల శాస్త్ర చర్చ లేనే లేదు. నేను ఇప్పుడు బ్రాహ్మణుడినీ కాదు, గరళయ్య అస్పృశ్యుడూ కాదు.

మనదొక కొత్తకులం-

కొత్త మతం.

సర్వకులాలను మతాలను ప్రాంతాలను భాషలనూ తనలో లీనం చేసుకున్న మహేశ్వర మతం-

వీర శైవం!

కుల వ్యవస్థ వీరశైవాదర్శానికి ప్రథమ అవరోధం!

దానిని సిద్ధాంతాలు చిలుక పలుకులలో కాక ఆచరణలో చూపే అదృష్టం నాకు లభించింది. భక్త మహాజనులందరూ ఈ అవకాశాన్ని సద్వినియోగపరచి ఆశీర్వదిస్తారని ఆశిస్తున్నాను."

మధువరసు ప్రసంగించగానే అనుభవ మంటప సభ్యులంతా హర్షధ్వానాలు చేశారు.

ఆ శబ్దాలకు భవనం మార్మ్రోగింది.

భవనాంతర్భాగంలోని గవాక్షాలలో గోపురాలలో గూళ్ళు పెట్టుకున్న పిచ్చుకలూ, గోరింకలూ, చిలుకలూ ఈ కనీ వినీ ఎరుగని శబ్దానికి భయపడి గగనతలంపై నర్తించాయి రివ్వున లేచి—

అల్లమ ప్రభువు-

"సభ్యులు తమ తమ అభిప్రాయాలు చెప్పవచ్చు" అన్నాడు అధ్యక్షస్థానం నుండి.

"ఆలస్య మెందుకు—మంచి ముహూర్తం నిర్ణయించండి" అన్నది అక్క నాగాంబికా.

"అనుభవ మంటపం శుష్క వేదాంత భవనం కాదని నిరూపించబోతున్నాము" అన్నాడు చెన్నబసవన్న.

"మనం ఒకవైపే ఆలోచిస్తున్నాము. రెండవ వైపు కూడా చూడటం మంచిది" అన్నాడు శివనాగుమయ్య.

"అంటే?" అని కోపంగా ప్రశ్నించాడు కుమ్మర గుండయ్య.

"ఏమీ లేదు. దీని పరిణామం ఎలా వుంటుందో కూడా ఆలోచించాలి కదా!" అన్నాడు శివనాగుమయ్య.

"ఔను మరి, కడుపులో చల్ల కదలకుండా కుటీర పరిశ్రమలు నడుపు కుంటేనే మోక్షం సిద్ధిస్తుందా? కాయకం సాధనమే కాని సాధ్యం కాదు'' అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"పెళ్ళి- ఓరయ్యోయ్- పెళ్ళి- తప్పెట్లూ, కాలి బొమ్మలూ, బూరాలు, డోళ్ళూ, వేణువులూ, వీణలూ, మండెగలు, పంచభక్షాలు, పులగములు, పులకండలూ- ఓహోహో! విందు భోజనాలు!" అన్నాడు ముగ్ధ సంగయ్య.

అంతా నవ్వారు.

"సద్దు- సద్దు. మిగిలిన సభ్యులు కూడా తమ తమ అభిప్రాయాలు చెప్పవచ్చు" అన్నాడు అల్లమ ప్రభువు అధ్యక్షస్థానం నుండి.

కొందరిది ఆదర్శ వివాహమన్నారు.

మరి కొందరు ఈశ్వరుడిచ్చిన అవకాశమన్నారు.

"చరిత్రలో అనుభవమంటపాన్ని శాశ్వతంగా నిలిపే సువర్ణ సంఘటన ఇది'' అన్నాడు ఏకాంత రామయ్య.

"భావికి మన కరదీపిక" అన్నాడు సిద్ధ రామేశ్వర మహాయోగి.

అందరూ తమ తమ అభిప్రాయాలు చెపుతున్నారు. అన్నీ వింటూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు బసవేశ్వరుడు. హరళయ్య, కల్యాణమ్మ తమ అంగీకారాలు తెలిపారు.

అక్కమహాదేవి ఆనందం వ్యక్తం చేసింది.

అల్లమ ప్రభువు "బసవేశ్వరా! అంతా తమ తమ భావాలు చెప్పారు. ఇక నీ అభిప్రాయం చెప్పవచ్చు'' అన్నాడు.

అప్పుడు బసవేశ్వరుడు లేచి సభామధ్యంలో నిలబడ్డాడు. అంతా చెవులు రిక్కించుకొని వింటున్నారు.

"భక్తుల పాదాలకు నా శరణు! చర్చలన్నీ విన్నాను. కాని మనం గమనించని అంశం ఒకటి వుంది- కల్యాణ నగర విప్లవాని కిది నాంది'' అన్నాడు.

సూది వేస్తే వినబడేటంత నిశ్శబ్దం భవనాన్ని ఆవరించింది.

ఎత్తైన భవన గోపురంలోని చిలుకల కలరావాలు మాత్రం సన్నగా విన్పడుతున్నాయి.

"ఇదొక మహా విప్లవం! సంపూర్ణ సమాజాన్నే పరివర్తన చేయదగిన విప్లవం! దీనితో బౌద్ధం వలె వీర శైవం కూడా సూర్యుడు వెలిగే సమస్త దిశలకూ వెళ్ళవచ్చు- లేదా మనకు వూహించరాని కష్టాలు కూడా ప్రారంభం కావచ్చు" అని ఒక్క-క్షణం ఆగాడు.

"కష్టాలకు మేము భయపడటంలేదు" శీలవంతు డన్నాడు.

"ఇది వ్యక్తి సమస్య కాదు- సమిష్టి సమస్య. సమాజ సమస్య" అన్నాడు చెన్నబసవన్న.

"సామాజిక విప్లవానికి ఇంధనాలుగా మారడానికీ"....అని శీలవంతు, డనే లోపలే—

"సమిష్టి సౌభాగ్యానికి సమస్త త్యాగాలు చేయడానికి" అని లావణ్యవతి అన్నది.

"మేము సంసిద్ధం" అన్న మాటను ఇద్దరూ కలిపి అన్నారు.

అప్పుడు బసవన్న ఇలా అన్నాడు—

"మనం ఎన్నుకున్నది ముళ్ళబాట. ఇది కంటకాకీర్ణ మార్గమని స్వయంగా తెలిసే కావాలని స్వీకరించాము. అందువల్ల కష్టాలు వస్తాయని భయపడటం కలలోని మాట.

కాకుంటే మన పరివర్తనకు సమాజం పరిపక్వమైందా? అని మాత్రమే నేను ఆలోచిస్తున్నాను."

అని ఒక్క- క్షణం ఆగాడు—

"సమాజం ఎప్పుడూ సామూహికంగా ఆలోచించదు. ఎవరో ఒకరు ఆలోచిస్తూ వుంటారు. ఆ ఆలోచనలను సమాజం మోసుకొని పోతూవుంటుంది" అన్నాడు చెన్న బసవన్న.

అప్పుడు అల్లమ ప్రభువు ఇలా చెప్పాడు—

"అందరి చర్చలూ విన్నాను. ఇక నా అభిప్రాయం చెపుతాను వినండి. మనమంతా సమస్యను ఇప్పటి వరకూ లౌకిక దృష్టితోనే ఆలోచించాము చాలావరకు. పారలౌకిక దృష్టితో కూడా ఆలోచించడం కొంత అవసరం. వివాహం షోడశ సంస్కా-రాలలో ఒక కార్యం. కాని శాంభవీ దీక్ష ఇవ్వబడిన తరువాత ఆ వ్యక్తి పురుష

యినా స్త్రీ అయినా పరమశివుణ్ణే తన భర్తగా స్వీకరించినట్లవుతుంది. వునికి భార్య అయిన వ్యక్తికి మానవకులాలూ, గోత్రాలూ ఉండవు. బట్టి నిత్యజీవనంలో వారు స్వీకరించే తోడు, వారికులమూ- ప్రసక్తికే రాదు.

ఇది శివకార్యం! దీనిని కల్యాణ నగరంలోని ప్రజలతో ఈ 'తాబ్దంలో జీవిస్తున్న వ్యక్తులుగా పరిశీలించకూడదు.

విశ్వప్రాతిపదికపై ఆలోచించండి. మనం చేస్తూన్న ఈ కర్మ వపూజలో ఒక భాగం.

దానికాయన ఎలాంటి ఫలితం ఇచ్చినా మనకు సంతోషమే- హాలాహలమో- అమృతమో!"

అంతా కరతాళ ధ్వనులు చేశారు.

"హాలాహలమెందుకు? అమృతమే పుడుతుంది" అన్నాడు చెన్న బసవన్న.

"ముందు హాలాహలం పుట్టినా అది అమృతావతరణానికే స్తుంది" అన్నాడు బసవేశ్వరుడు.

"వివాహానికి ముహూర్తం?" హరళయ్య ప్రశ్నించాడు.

"ముహూర్తం శివముహూర్తమే" అన్నాడు బసవేశ్వరుడు.

"అంటే....?" అన్నాడు ముగ్ధసంగయ్య నోరు చప్పరిస్తూ.

"శివ ముహూర్తమంటే సత్సంకల్పం కలిగిన ముహూర్తమే! తిథులూ, వారాలూ, నక్షత్రాలూ, జ్యోతిషమూ ఇవన్నీ సత్యాలు కావు. శ్వరచనలో పరమేశ్వరుని కాలకేళిలో ప్రతీ ముహూర్తమూ దివ్యమే" అన్నాడు బసవేశ్వరుడు.

సభ్యులంతా మళ్ళీ కరతాళ ధ్వనులు చేశారు.

మధువరసూ, లావణ్యవతీ శాంభవీ దీక్ష స్వీకరించారు.

వీరశైవ సాంప్రదాయ బద్ధంగా వివాహం జరిగింది.

వీరభద్ర పళ్ళెరాలూ, ఖడ్గతాండవాలూ, మాయాదేవి లాస్యమూ, నందికోల ఆటలూ, ప్రేరణ శివతాండవం, మృష్టాన్న పంక్తి భోజనాలతో ఆ సాయంత్రమూ, రాత్రీ, అర్ధరాత్రీ అనుభవ మంటపం భూకైలాసమైంది.

ప్రభాత పవనాలు వీచాయి.
ఉషస్తార పొడిచింది.
అనుభవమంటపంలోని నృత్యాలు సాగుతూనే ఉన్నాయి.
"దక్షాధ్వర ధ్వంస" యక్షగాన ప్రదర్శన నడుస్తూ వుంది.

# 24

నారాయణాచార్యులపై హత్యా ప్రయోగం జరిగిన వార్త నగరమంతా వ్యాపించింది.

ఆ వార్త రకరకాల రూపాలను సంతరించుకున్నది.

బిజ్జలుడే కావాలని నారాయణాచార్యులను చంపాలనుకున్నాడు-ఎందుకంటే బసవన్న చేసే సంస్కరణాలను నారాయణాచార్యులు విమర్శిస్తున్నాడు. బిజ్జలుడు బసవన్నకు పూర్తిగా లొంగిపోయాడు.

నంది అంటే నంది, పంది అంటే పంది-ఎంత చెపితే అంత!

మరో వార్త ఇలా వ్యాపించింది-

బిజ్జలుని పట్టమహిషియే బిజ్జలుని హత్య చేయించాలని ప్రయత్నించింది. ఆమెకు తానే రాణి కావాలని ఊహ. బసవన్న ఆమెను బలపరచాడు.

ఇంకో వార్త-

నారాయణాచార్యుల వారే తన మహిమ ప్రదర్శించాలని ఇలాంటి సన్నివేశం తన యోగశక్తితో కల్పించాడు. తన ప్రభావం రాజుకు చూపాడు.

ప్రభువు దిగ్భ్రాంతుడైనాడు.

అంతఃపురంలోని వంటవాడు చాళుక్యుల కాలంనుంచీ ఉన్నవాడు. అతడికి తైలపుడంటే అభిమానం.

అబ్బే! వంటవాడు చాలామంచి వాడు. పైగా ప్రభువులవారి

హారపదార్థాలన్నీ వైద్య, రసాయనిక పరీక్షల అనంతరమే ఇస్తారు- ఇదేదో పొరపాటున జరిగింది.

పాలు కోష్ఠము నుండి వెండి బిందెలతో వస్తున్నప్పుడు గరుడుడు ఒక పామును తన్నుకొంటూ పోతుంటే అది విషబిందువును కక్కింది. పాల బిందెపై కప్పిన వస్త్రం గాలికి తొలగింది. తప్పు గరుడుదీ కాదు, పాముదీ కాదు, గాలిదీ కాదు, పాలవానిదీ కాదు....

ఇలా సాగాయి కథలు.

"నిశ్చయంగా ఇది భైరవుని కోనలోని పిశాచాలు చేసిన మరో ప్రయోగమే" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"మనలను బసవేశ్వరుడు తొందరపడవద్దని చెప్పాడు కదా" అన్నాడు శీలవంతుడు.

ముగ్ధసంగయ్య ఇంట్లో కలిశారు ఇరువురూ.

మాఘ బహుళ దశమి.

సంగయ్య గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు.

"ముసుగు మనిషి రహస్యాలు కనుగొన్నాను. త్వరలో రాజ్యంలో విప్లవం తీసుకురావడానికి వాళ్ళు అన్ని సన్నాహాలు చేస్తున్నారు" అన్నాడు శీలవంతుడు.

"నారాయణాచార్యులపై హత్యాప్రయోగం జరిగినందుకుగాను హంతకులలో పరివర్తన కలగాలని బసవన్నగారు పరుసకట్టె వద్ద నిరాహారదీక్ష ప్రారంభించారు.

రాజ్యంలోని జైన గ్రామాధికారులు సమ్మె ప్రయత్నాలు ప్రారంభించి ఆర్థిక యంత్రాంగాన్ని స్తంభింపజేయాలని ప్రయత్నిస్తున్నారు" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"ఈ విషయాలు ప్రభువుకు తెలియవా?"

"తెలుసు! రహస్య విభాగం వారు ఈ వార్తలను ఎప్పుడో అందించారు. అందుకే నిప్పులు తొక్కిన కోతిలా గెంతుతున్నాడా బిజ్జలుడు. నిన్నటికి నిన్న ఇద్దరు ప్రభుత్వ కార్యదర్శులను పనినుండి తొలగించాడు. అంతఃపురంలోని వంటసాలవారినీ, గోశాలలోని అధి

కారులను పనులనుండి తొలగించి బంధించి విచారణలు జరిపి
స్నాడు. నారాయణాచార్యులవారి ఆరోగ్యం వైద్యశాలలో బాగా క్షీణి
చింది."

బయట బహుళ చంద్రుడు ఉదయించాడు.

"శీలవంతా! నా కెందుకో అనుమానంగా వుంది. బసవేశ్వరునికి చెప్పి ససైన్యంగా భైరవుని కోనను ముట్టడిస్తే...."

"అలా కాదు-ముందు నంది సముద్రం చుట్టూ కాపు ఉంచాలి."

"నీకా భయం అక్కరలేదు. రెండవ సొరంగ మార్గం పిశాచాలకు కూడా తెలియదు. బహుశా ఆ భవనాన్ని రహస్యంగా ఎప్పుడో ఎన్ని తరాలకు ముందో చాళుక్యుల కాలంలో నిర్మించిన శిల్ప కారులకు మాత్రమే తెలిసి వుంటుంది. నిర్మాణానంతరం రహస్యం కాపాడుకోడానికై రాజులు వారిని చంపి వుంటారు."

"అలా కాదు, ఒకే సారి అష్ట దిగ్బంధనచేయాలి."

"అంటే?"

"ముసుగు మనిషి ఇల్లు, వటవృక్ష ద్వారం, నంది సముద్రం గట్టు, బిజ్జలుని అంతఃపురం, బసవన్న మందిరం, అనుభవ మంటపం, కోట ద్వారం, కేదారయ్య దుకాణం అన్నీ ఒకే సారి సైనిక మయం చేయాలి. అప్పుడు ముఖ్యమైన వ్యక్తులకు అపాయం జరుగకుండా కావలసిన వ్యక్తులను బంధించ గలుగుతాము."

"శీలవంతా! నీవు తెలుసుకున్న ఇతర వివరాలేమిటి?"

"ముసుగు మనిషి పిశాచ రాజ్యంతో చేతులు కలపడంలో ఆర్థిక కారణాలతో బాటు స్వప్రయోజనాలు కూడా ఉన్నట్టు అన మానంగా వుంది. అలాగే పిశాచాలలో కొన్ని బౌద్ధ పిశాచాలూ, కొన్ని జైన పిశాచాలూ, కొన్ని అద్వైత పిశాచాలూ ఉన్నాయి. రాజ్యంలో కల్లోలం లేపడం, బిజ్జలుణ్ణి పతనం చేయడం, ఆ నేరం బసవన్న పైకి నెట్టడం వాళ్ళ వ్యూహ్యమని గ్రహించాను.

"ఇకపోతే ఇటీవల నాకు తెలిసిన విషయాలివి-విజయదశమి నాటి విషలిప్త బాణ ప్రయోగం చేసినది శాంతార రాజ్య సైనికుడని బసవన్నగారు ఊహిస్తున్నారు. ఆ బాణమూ, ధనువూ దానిపై శిల్పమూ, శాంతార రాజ్యానికి చెందినవి. శాంతార సేనాపతి జగదేవ

దండ నాయకుణ్ణి బిజ్జలుడు పరాజితుణ్ణి చేశాడు కదా, అందుకని జగదేవుని అనుయాయులు పగబట్టి ఉంటారు. అలాగే క్షీర ప్రయోగం కూడా బిజ్జలునికై ఉద్దేశింపబడినట్టిదే! వంటవానికీ, పరిచారికకూ కూడా తెలియకుండా జరిగిన ప్రయోగమిది."

"అంటే-అంతఃపురంలోనే బిజ్జలునికి వ్యతిరేక వర్గం వుందా?"

"దానితోనే బిజ్జలుడు నిద్రాహారాలు మానివేశాడు. ప్రతివారినీ అనుమానిస్తున్నాడు. ఇది ఎలా పరిణమిస్తుందో తెలియదు."

"బసవన్నగారి నిరాహార దీక్ష వల్ల ప్రయోజనం ఉంటుందా?"

"బసవన్న ఆదర్శవాది. పాము కోరల నుండి క్షీర ధారలు పిండాలని ఆయన తపస్సు. ఇది సుదీర్ఘ ప్రణాళిక. మానవత ఇంకా ఇన్ని వేల ఏండ్లయినా ఆ దశకు వికసించలేదు. బసవన్న అకాల దోహద క్రియలతో పుష్పింప జేయగలడా సమాజ వృక్షాన్ని?"

కొన్ని క్షణాలు నిశ్శబ్దం-

"కేదారయ్య దుకాణంలో, ముసుగు మనిషి ఇంటిలో- నేను ఇంద్రజాల విద్యతో సేకరించిన విషయాలు కొన్ని- ఉన్నాయి" అన్నాడు బ్రహ్మయ్య.

"ఏమిటవి!"

"పిశాచాల భాష? చదవడం నేర్చుకున్నాను."

"ఎలా?"

"వారు ఏకాక్షర నిఘంటువును ఆధారం చేసుకుంటారు కొన్ని సమయాలలో. ఇక వారు వాడే అచ్చులూ హల్లులూ-సంయోగం లేని శబ్ద రూపాలు. ఆ పేర్లు...." అని ఏదో చెప్పబోతూ కలకేత బ్రహ్మయ్య భైరవునిలా వాసన చూచాడు. ఉన్నట్టుండి రివ్వున తలుపు తీసి వీధిలోకి దూకాడు. బ్రహ్మయ్య ఇలా దూకే సరికి రివ్వున శరవేగంతో ముగ్ధసంగయ్య ఇంటి ముందు నుండి ఒక వ్యక్తి చీకట్లో కలిసిపోయాడు.

బ్రహ్మయ్య తిరిగి లోపలికి వచ్చి "శీలవంతా! ఎవరో పొంచి మన మాటలు వింటున్నట్లు నాకు అనుమానం వచ్చింది. అది నిజమైంది. మనలను ఎవరో నీడలా వెంబడిస్తున్నారు...." అన్నాడు.

"అయితే ఈ ముగ్ధసంగయ్య ఇల్లు కూడా ఇక వదల వల పిందే?"

"ఆఁ! వేశ్యా మహర్షి జటా జూటం గూర్చి, వక్షస్థలంలో తపో మహిమ వల్ల మొలిచిన రెండు కొమ్ములను గూర్చి ముగ్ధ సంగయ్య చెప్పే చమత్కారాలు ఇక మనం వినలేము. లే. పోదాము"

ఇరువురూ క్షణంలో పిశాచ వేషాలు ధరించారు.

చీకట్లో కలిసిపోయారు. అలా ఎక్కడెక్కడో తిరిగి, పోయి పోయి నంది సముద్రం గట్టు మీద తేలారు.

అక్కడ వారికొక విచిత్ర దృశ్యం కన్పడింది.

అందెలరవళితో కొన్ని కామినీ పిశాచాలు గానం చేస్తూ అరణ్యాలలోకి పోతున్నాయి.

"శీలా! పరిస్థితిలో ఏదో మార్పు వచ్చింది."

"ఉశ్!"

"లోనికి వెళ్దామా?"

"అదుగో అటు చూడు."

నంది సముద్రం గట్టున పల్లకీ ఆగింది.

అందులో నుండి ముసుగు మనిషి దిగింది. పిశాచాలు వెంట బెట్టుకొని లోనికి తీసుకు పోతున్నాయి. తాము లోపలికి వెళ్ళాలా వద్దా అని బ్రహ్మయ్యా, శీలవంతుడూ ఆలోచించే లోపలే ముసుగు మనిషి మళ్ళీ బయటకు వచ్చింది.

పల్లకీ ఎక్కింది.

కళ్ళకు గంతలు కట్టి పిశాచాలు ముసుగు మనిషిని తీసుకొని వెళ్ళి తీర్థంకర శిథిలాల వద్ద వదలి వెళ్ళిపోయాయి.

ఇదే తగిన సమయమనుకొని శీలవంతుడూ, బ్రహ్మయ్యా ముసుగు మనిషి దగ్గరికి పోయారు.

"ఐ-అ-అ" అన్నారు.

ముసుగు మనిషి "ఐ-అ-అ" అని సమాధానమిచ్చి-

"ఇదేమిటి మళ్ళీ వచ్చారు? ఎవరు మీరు?" అన్నాడు.

"మేము భైరవుని కోనలోని పిశాచాలమే. కొంచెం అత్యవసర మైన పని మీద వచ్చాం" అన్నాడు బ్రహ్మయ్య గొంతు మార్చి.

"ఏమిటి? టింటాకరాళుని ఆరోగ్యం కలవర పెట్టిందా మళ్ళీ?"

"ఔను....ఔనౌను. ఔషధ సేవనం కావాలి" అన్నాడు బ్రహ్మయ్య సమాచారం కనిపెట్టడానికి.

"ఇందాక ఓషధులూ, వైద్యులూ వచ్చారు కదా-"

"టింటాకరాళుడి ఆరోగ్యం 'ఆ' పని జరిగితేనేగాని చక్క బడదు" అన్నాడు బ్రహ్మయ్య.

దానితో ముసుగు మనిషికి కోపం వచ్చింది-

"మీకు ప్రతి దానికీ తొందరే! పరిస్థితులు అనుకూలం కాక ముందే హత్యా ప్రయత్నాలు మంచివి కావు. మొదట విషలిప్త బాణం వ్యర్థమై పోయింది. రెండవ సారి పాల ప్రయోగమూ విషమించి మన వాడే వైద్యశాలలో చేరాడు.

జగదేవ దండ నాయకునికి ఆతృత ఎక్కువ.

కార్య సాధనం కావాలి కాని మొండి ధైర్యం కూడదు.

ఉన్న ప్రమాదాలు ఇలా వుండగా స్త్రీలతో సహా భైరవుని కోన నుండి స్థావరం మార్పిస్తున్నాడు.

అంత ప్రమాదం ఏం ముంచుకు వచ్చిందో తెలియదు.

బసవన్న చారులు ఉనికిని కనిపెట్టారని ఆయన కలవరం."

"మరి చివరి ప్రయత్నానికి ముహూర్తం?" అని అడిగాడు బ్రహ్మయ్య.

"అది, టింటాకరాళుడే నిశ్చయించాలి. అటు సమ్మె, యిటు విప్లవం ఒకేసారి జరగాలి___

అందులో లావణ్యవతీ శీలవంతులు మల మల మాడి చావాలి" అన్నాడు ముసుగు మనిషి రోషంతో.

శీలవంతునికి బాగా కోపం వచ్చింది.

కాని నిగ్రహించుకున్నాడు.

"ఇంతకూ మేము వచ్చిన పని ఏమిటంటే బసవన్నపై విష ప్రయోగం చేయమని మీకు కబురు వచ్చింది."

"అదేమిటి! ఇందాక మంత్రవాది రాయమురారి నాతో అలా అనలేదే! ప్రజా విప్లవమే వాళ్ళను శలభాలుగా దహించి వేయాలని అన్నాడే!"

"ఐ-అ-అ. పేర్లువద్దు-పేర్లువద్దు" అన్నాడు బ్రహ్మయ్య-మనసులోని సంతోషం బయటకు కన్పడనీయకుండా.

మంత్రవాది రాయమురారి అని శీలవంతునికీ, బ్రహ్మయ్యకూ దీనితో స్పష్టమైంది.

టింటాకరాళుడు త్రైలపుడేననీ ఐ-అ-అ- అంటే 'త్రై-ల-ప' శబ్దంలోని మూడు అచ్చులనీ వారికి ముందే తెలుసు.

"కేదారయ్య దుకాణానికి నిధులు పంపుతాము. విప్లవానికి సిద్ధం చేయండి" అన్నాడు బ్రహ్మయ్య.

"నిధులు చాలడంలేదు. జైనులు సమ్మె కోసం కోటి సువర్ణ నిష్కాలు అడుగుతున్నారు. కాగా నూతన సైనికులను సమకూర్చుకోవడం కోసం...." అని ఇంకా ఏదో చెప్పబోతున్నాడు.

బ్రహ్మయ్య నరవాసన పసిగట్టి ఎవరో వ్యక్తులు గాలిలో కదులుతున్నట్లు గ్రహించాడు.

శీలవంతుణ్ణి చేతితో గుచ్చి తాను బోర్లా పడుకున్నాడు.

రివ్వున మూడు విషలిప్త బాణాలు వచ్చి తాకాయి. రెండు గాలిలో దూసుకుపోయాయి. మూడవది మాత్రం ముసుగుమనిషికి తాకింది.

ముసుగు మనిషి విలవిల లాడుతూ కింద పడిపోయాడు.

'ఐ-అ-అ' అని అరుస్తూ మూడు పిశాచాలు తీర్థంకర విగ్రహాల చాటు నుండి రివ్వున గాలిలో కలిసిపోయాయి.

"ఏమిటి? ఏమి జరిగింది?" శీలవంతుడు ప్రశ్నించాడు.

"మనం ముసుగుమనిషిని వెంటాడాము. మనలను పిశాచాలు వెంటాడుతూనే వున్నాయి. మన సంభాషణ విని తమ రహస్య సమాచారం బయట పడిపోయిందని ముగ్గురిపైనా హత్యా ప్రయోగం జరిగింది...."

ముసుగు మనిషి విలవిల లాడుతున్నాడు.

గుర్రాల చప్పుడు-

కాగడాలు-

"బంధించండి- వాళ్ళను!"

గుర్రాలపైనుండి బిజ్జలుని సైనికులు దిగారు. శీలవంతుణ్ణీ, కలకేతబ్రహ్మయ్యనూ బంధించారు. కాగడా వెలుగులో ముసుగు మనిషి ముసుగు తొలగించారు!

కృష్ణ పెద్ది!

విషప్రయోగంతో గిలగిలా కొట్టుకుంటున్నాడు.

"బ్రహ్మయ్యా!"

"శీలవంతా! తొందర పడ్డాం మనం, బసవన్నగారి మాట వినకుండా! మనం పిశాచాలను అంటిపెట్టుకున్నట్లే బిజ్జలుని రహస్య చారులు మనలను కనిపెడుతూనే వున్నారన్న మాట! చీకట్లో పిశాచాలు బాణప్రయోగం చేసిన సంగతి వీరికి తెలియదు. మనమే కృష్ణ పెద్దిని చంపామంటారు వీళ్ళు. తైలపునికీ జగదేకమల్లునికీ మళ్ళీ విజయం లభించింది."

# 25

పుష్యబహుళ త్రయోదశి!

నల్లని ఆకాశాన్ని సహస్రధా చీల్చుకుని కైలాసం దిగివస్తున్నదా అన్నట్లు తెల్లని తారలు గగనానికి రంధ్రాల్లా కనపడుతున్నాయి.

ఆ నాడు లావణ్యవతిని లకుమాయి తన తనివితీరా అలంకరించింది. వీణావళిలో లేత నారింజరంగు చీరను దానికి సరైన రవికెను దరింపజేసింది. తాటంకములు, త్రిసరములు, మొరవంక కడియాలు, ముంగర, భలిరలు, కాంచీనూపురము, అందెలు అలంకరించింది. చేతులకు గోరింటాకు పెట్టి మధ్యలో చిన్న కాకరాకు వేసింది.

అకువేయబడినంత వెడల్పూ సుకుమారంగా గులాబీ వర్ణంలో అర చేతులు కనబడుతూ చుట్టూ ముదురు ఎరుపురంగులో చేయి పండింది. పాదాలకు పెట్టిన లత్తుక కాంతులు భూమిని స్పృశించి అగ్నిరేఖలను సృజిస్తుంటే దక్షుని యింటనున్న సతీదేవి కాలికాంతులు దిక్కులకు వ్యాపించి నట్లనిపించింది.

"అమ్మాయిగారూ! మీరీ వేళ అప్సరసలా వున్నారు" అన్నది లకుమాయి.

"ఛీ! అదేమి పోలికే! అప్సరసలంతా దేవనర్తకీమణులు" అన్నది లావణ్య.

"రతీదేవిలా ఉన్నారు" అన్నది లకుమ.

"అది మంగళకరమైన పోలిక కాదు" అన్నది లావణ్య.

"కల్యాణం నాటి పార్వతీదేవి వలె ఉన్నారు" అన్నది లకుమ.

"అపర్ణనై ఆమె వలె గౌరీ శిఖరంపై నేను తపస్సుచేశానా?" అన్నది లావణ్య.

"మీ తపస్సు ఆమెకే తెలుసు" అన్నది లకుమ నవ్వి.

"అయితే శివుడు చర్మసౌందర్యాన్ని కాక ఆత్మసౌందర్యాన్ని కాంక్షిస్తాడని తెలుసు కదా!" అన్నది లావణ్యవతి.

మధువరసు భవన ఉపరిభాగంలో ఒక దీర్ఘమైన గదివుంది. అది రత్నాలంకృతమైనది.

అచ్చటచ్చట పొదగబడ్డ రత్నాల నడుమ చిన్న ఆముదపు ప్రమిద వెలుగుతూ గదిని అస్తమిత సూర్యకాంతులలోని అరుణా రుణ వర్ణంతో నింపివేసింది.

హంసతూలికా తల్పాన్ని లకుమాయి చక్కగా అలంకరించింది. చేమంతి పూలూ, మరువమూ దండలుగా కట్టి మంచానికి వ్రేలాడ దీసింది. మంచంపైన భావజ తిలకపు వస్త్రాలను పరిచింది. అవి లతలతో పువ్వులతో మంచి నగిషీపని చేయబడ్డ అంచులతో ఉన్నాయి,

గదిలో ఒకమూల అగరు ధూపం వలయాలుగా ధూమ మాలికలను సృజిస్తూన్నది.

లావణ్యవతి కొంతసేపు వీణ వాయించింది.

పైనున్న తారషడ్జమ స్వరమును అనేక సార్లుఅంది లీనమై. కాకలి నిషాద స్వరాక్షరముగా పలికే కంపితములు వీణపై ప్రదర్శించింది.

లావణ్యవతి క్రీ. పూ. 100 ప్రాంతంలోని ఇళంగ్ కోవళిగళ్ రచించిన శిలప్పాది రాగాన్ని ఆధారంగా చేసుకొని వ్యాపించిన ద్రావిడ సంగీత సిద్ధాంతాన్ని అభ్యసించింది. ఈ శాస్త్రంలో సప్తస్వరాక్షరాలను కురల్, తుత్తరి, కైక్కిళై, ఉళై, ఇళి, విళరి, తారమ్ అంటారు.

ఒక స్థాయిలో పన్నెండు సమ భావ స్వరస్థానములను షడ్జ పంచమ (కురళ్- ఇళి) మూలంగా ద్వాదశ రాశీచక్రం వ్రాపి దానిలో తులారాశిలో షడ్జమును, దానికి ఐదవ వృషభరాశిలో పంచమమును ఉంచి- పిదప ఈ వృషభరాశిలోని పంచమమును షడ్జముగా భావించి దానికి ఏడవరాశి ధనుస్సులో రెండవ పంచమమును వ్రాసి- ఇలా పన్నెండు రాసులతో పన్నెండు స్వరాలను కల్పిస్తారు.

స్వరాలంటే గ్రహాలేనని, రాగాలాపనతో గ్రహాల ఆగ్రహాలూ, అనుగ్రహాలూ ఉంటాయని చిన్నప్పటి నుంచీ తండ్రి నూరిపోసిన సంస్కారాలు, అనుభవమంటపంలోని స్వల్ప కాలిక సంపర్కంవల్ల తొలిగిపోలేదు.

విపంచి తనకు తెలియకుండానే తన చేతిలో నుండి జారిపోయింది.

పరాకుగా చిరునవ్వు నవ్వి లేచింది లావణ్య. మధువరసు భవనానికి ఆనుకొని పెద్ద కొబ్బరితోట వుంది. అక్కడ గిజిగాడులు వేల సంఖ్యలో గూళ్ళు పెట్టుకున్నాయి.

సన్నని పొడవైన ఆకుపచ్చని పాము ఒకటి కొబ్బరి ఆకుల మధ్యగా దూకివచ్చి పక్షుల గుడ్లను తినిపోతూ ఉంటుంది. అప్పుడవి కీచు-కీచుమని అరుస్తాయి. ఉన్నట్లుండి పదివేల వీణలు ఒకేసారి అపశ్రుతులతో మీటినట్లు కొబ్బరి తోటలో గిజగాళ్ళ ధ్వనులు మన్నూ మిన్నూ ప్రతిధ్వనించాయి.

లావణ్యవతికి నిద్ర రాలేదు.

ప్రకృతిలోని ప్రతిశబ్దమూ ఆమెకు సుస్పష్టంగా ఎంతో పెద్దదిగా వినపడుతున్నది.

రివ్వు రివ్వున దీపపు పురుగులు ఎగురుతున్న శబ్దం-

వాటి రెక్కలు రాలిపోతున్న శబ్దం-

భవనోపరిభాగంలో ఒక బల్లి పాకుతూ మధ్య మధ్య చేస్తున్న ధ్వని-

గాలికి కదులుతున్న తలుపు శబ్దం-

రివ్వున కొబ్బరి మట్టలు ఊగి సృష్టిస్తున్న ధ్వని- అన్నీ చాలా సుస్పష్టంగా లావణ్యవతికి ఈ రాత్రి వినబడుతూ ఉన్నాయి.

లకుమాయి మేడపైనుండి కిందికి చూస్తుంది.

మళ్ళీ చిరునవ్వుతో తానేమీ చూడనట్లే వచ్చి కూర్చుంటున్నది.

"లకుమా! ఏదైనా పాట పాడవే!"

"ఏం పాడను అమ్మాయిగారూ?...."

"నీ ఇష్టం."

"లకుమకు చాలా పురాతన భక్తి గీతాలు వచ్చు. సంస్కృత సాహిత్యం కూడా కొంత చదువుకున్నది. అక్కమహాదేవి వచనాలూ, చెన్నబసవన్న వచనాలూ బసవేశ్వరుని వచనాలూ అన్నీ ఆమెకు కంఠతా వచ్చు.

"ధనవంతులు నిర్మింతురు నీకై
ధగద్ధగోజ్జ్వల గోపురాదులను
ధనములేని బడుగును నే నెట్టుల
తమకై కట్టుదు శివాలయంబును
స్వామీ కూడల సంగమ దేవా!
చెడును స్థావరము-జంగమమిదిగో
పాదములివి ఆలయ కంబంబులు

పసిడి కలశమగు నా శిరమిదిగో-

నడిచెడి ఈ దేవాలయమ్ములో

నివసింపుము శ్రీ సంగమేశ్వరా!

శ్రావ్యంగా బసవేశ్వరుని ఈ వచనాన్ని లకుమ గానం చేసింది.

లావణ్యవతి కన్నులు తెరచుకొని లకుమను చూస్తూనే ఉన్నది.

ఆమె పెదవులపై దరహాసం వెల్లి విరుస్తూనే వుంది. ఆమె చెవులకి గానం అందుతూనే వుంది.

ధూప ధూమ సౌగంధ్యాలు గుబాళిస్తూ ఆమె నాసాగ్రాలను చుంబిస్తూనే ఉన్నాయి.

తన తలలో దాల్చిన కనకాంబరాలమాల సగం జారి వీణావళి రవికె అంచు కింద భాగాన వున్న శరీరభాగాన్ని తాకుతూ ఉంది.

అయితే ఆమెకి పంచానుభూతులూ కలుగుతున్నట్లు అనిపించడంలేదు.

ఆమె లకుమను చూస్తూ లకుమను వింటున్నది కాని ఆమెకు లకుమ కనబడటం లేదు, వినబడటం లేదు.

లకుమ మరి రెండు గీతాలు పాడింది.

లావణ్యవతి అడగలేదని అంతటితో ఆపింది.

ఆకాశం ఎందుకో మబ్బుపట్టి ఎర్రనైనట్లు తోచింది.

ఈదురు గాలి మొదలైంది.

కొబ్బరి ఆకులు వేగంగా ఊగుతున్నాయి.

గాలి క్రమంగా పెద్దదైంది.

పారిజాతాలు, బిళ్ళగన్నేరులు, ఎర్రగన్నేరు మొగ్గలూ- జలజలా రాలిపోతున్నాయి.

అకాల వర్షం-

టప టాపా చినుకులు-

గాలి క్రమంగా హోరెత్తుతున్నది.

నరారణ్యం గర్జిస్తున్నట్టు-
జనార్ణవం ఘూర్ణిల్లుతున్నట్లు-
హోరున- జోరున- వాయుధ్వనులు!

లకుమాయి ప్రత్యక్షమయ్యామాని కనుగుణంగా మేళవించిన రాగాన్నే నిశిరాత్రి తర్వాత అకాలంలో గాలికి తనంత తానే పలుకుతున్నది విపంచి.

భక్త కూటములోని భజనగీతాలు. శివానుభవ మంటపంలోని సంకీర్తనలూ హోరు గాలిలో కలిపి ఉన్నట్లుండి ఒక్కసారి సముద్రపు కెరటాలు విరిగి పడ్డట్లు ధ్వనులు విరిగి విరిగి పడి ఆగిపోతున్నవి గదిలోకి. లకుమాయి కిటికీ తలుపులు మూసి వేసింది.

ధ్వనులు తగ్గాయి.

గాలి తలుపులను గట్టిగా నెట్టుతున్న శబ్దం.

అశ్వికుడు తోలు కోలతో జవనాశ్వాన్ని బాదినట్లు తలుపులపై వర్ష ధారల మోత.

గోడపై బల్లి బద్ధకంగా ఆవులించింది.

బయట శబ్దం-

గుర్రాల సకిలింపులు.

లకుమ తొంగి చూచింది-

మధువరసు వచ్చాడు.

ద్వార పాలకులు తలుపులు తెరిచారు.

బిజ్జలుని భవనం నుండి వస్తున్నాడు మధువరసు. శీలవంతుడు కృష్ణపెద్దిని హత్య చేశాడన్న నేరం కింద బంధితుడై వున్నాడని మధువరసుకు రాజ భవనంలో తెలిసింది.

మధువరసు మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు.

భవన ద్వారాలు మూసుకున్నాయి.

బయట గుర్రాల సకిలింతలు.

"లకుమాయీ-లకుమాయీ!"

లావణ్య పిలిచింది.

లకుమయీ అర్ధ చైతన్యావస్థలో వుంది.

"ఆకాశమే జటాజూటంగా, వర్షధారలె గంగా తరంగాలుగా, పర్వతాగ్రం పానవట్టంగా, ఉరుములు డమరునాదాలుగా, మెరుపులు సర్పాలుగా, దట్టమైన కారు మబ్బులు గజ చర్మంగా, ఈ వర్షమే శివ స్వరూపంగా భాసించి ఈ కల్యాణనగర పార్వతీ అర్ధాంగ స్పర్శతో దివి నుండి భువికి తాండవనృత్తనం జరుగుతున్నట్లుగా అనిపిస్తున్నది లకుమాయీ ప్రకృతి నాకు."

వర్షం ఇంకా ఎక్కువైంది.

లకుమాయి నిద్ర పోయింది.

ఆముదపు దీపం కొడి గట్టింది. గది మసక చీకటి అయింది.

లావణ్య తిరిగి వత్తిని నూనెతో తడిపింది.

రత్నారుణ కాంతులు తిరిగి వ్యాపించాయి.

దూరాన ఎక్కడో పిడుగు పడ్డ శబ్దం!

'వర్షరుద్రుని మూడవ కంటి మంట' అనుకున్నది లావణ్య!

# 26

"ప్రభువులకు వందనాలు!" బసవేశ్వరుడు బిజ్జలుని అంతరంగిక మందిరం ప్రవేశించాడు.

ఆ నాడెందుకో రాజ భవనం చుట్టూ అశ్వికులైన సాయుధ సైనికులు పహరా తిరుగుతున్నారు.

ఎంతటి ఉన్న తాధికారికయినా భవన ప్రవేశం దుర్లభమవుతున్నది.

బిజ్జలుని మందిరంలోకి బసవేశ్వరుడు ప్రవేశించగానే అన్ని ద్వారాలూ మూసుకున్నాయి.

సువిశాలమైన పచ్చలు పొదిగిన మందిరం.

భూమిపై ఎర్రని కాశ్మీరపు పట్టు తివాసీ.

సమున్నతాసనంపై బిజ్జలుడు కూర్చొని ఉన్నాడు.

ఆయన మనస్సులోని ఆందోళన ముఖంలోనే వ్యక్తమవు తున్నది స్పష్టంగా!

బసవన్న పక్కనే ఆసన మలంకరించాడు.

ప్రభాతారుణస్పర్శకు అప్పుడే వికసించే సహస్ర దళ ముగ్ధ పద్మంలా వున్నాడు బసవన్న-

పాల పొంగులాంటి తేజస్సు-

పసిపాప నవ్వు వంటి నైర్మల్యం- అమాయకత్వం.

బిజ్జలుడు చాలా సేపటి వరకూ మాట్లాడలేదు. బసవేశ్వరుడే సంభాషణ ఉపక్రమించాడు.

"తైలపుడూ, సోమేశ్వరుడూ- కాకతీయ ప్రోలరాజు వద్ద బందీగా ఉన్న వార్త అసత్యం ప్రభూ! వారిని ప్రోలుడు బందీ చేసి వదిలాడో లేక అసలు బందీయే చేయలేదో మనకు స్పష్టంగా తెలియక పోయినా ఇన్నేళ్ళుగా వారు కాకతీయ రాజధానిలో ఉన్నారన్న భ్రమ మాత్రం అసత్యమని ఇటీవల తెలుసుకున్నాను.

భైరవుని కోనలో చాళుక్యులు కట్టించిన రహస్య నేల మాళిగలో వారు మారు పేర్లతో, రహస్య పరిభాషతో వ్యవహరిస్తూ వున్నారు. టింటాకరాళుడంటే తైలపుడు, మంత్రవాది అంటే యువ రాజు సోమేశ్వరుడు, ముగ్గురు పిశాచ ముఖ్యులూ తైలపుని సేనా నాయకులు. ఒకడు జగదేవ దండ నాయకుడు, తమ చేతిలో పరాజితుడైన శాంతార వంశస్థుడు, రెండవవాడు మల్లిదేవుడు తైలపుని సేనాని- మూడవ వాడు కుమార బ్రహ్మయ్య. 'చాళుక్యరాజ్య ప్రతిష్టాపక' బిరుదాంకితుడు.

ఇక పిశాచాల రూపంలో జైనులూ, బౌద్ధులూ, అద్వైతులూ, కొందరు సనాతనులూ వ్యవహరిస్తున్నారు. రాజ్యంలో కల్లోలాలు రేపుతున్నదీ వారే! విష ప్రయోగాలు చేస్తున్నదీ వారే- అంతేకాక యుద్ధానికి వారు సైన్యాలను సమకూర్చుకుంటున్నట్లు కూడా తెలిసింది.

ఇటీవల తైలపుడు తీవ్రంగా అస్వస్థుడైనాడు. అతనికి వైద్య ప్రయత్నాలు జరిగాయి. ఇవన్నీ శీలవంతుడూ, కలకేతబ్రహ్మయ్య కనుక్కోగలిగారు. కృష్ణపెద్ది ముసుగు మనిషిగా తైలపుని

మతాలో చేరినట్టు గ్రహించగలిగినది శీలవంతుడే, నంది సముద్రం చెరువులోని రహస్య సొరంగం ద్వారా చాలాసార్లు సాహసయాత్రలు చేసి తక్కిన రహస్యాలన్నీ కనుక్కోగలిగింది కలకేతబ్రహ్మయ్య."

"అయితే తైలపుణ్ణి ఎందుకు బంధించలేదు?"

"బంధించే ప్రయత్నాలను సకాలంలో చేద్దామని అనుకుంటూ ఉన్నాను. పైగా తైలపుణ్ణి బంధించడం మన లక్ష్యం కాదు కదా! ఈ రాజ్యం తైలపునిది. ఆయన రాజ్యం నేడుకాక రేపైనా ఆయనకు సమర్పించవలసిందేనని తమరు అంటూ ఉన్నారు. కాకుంటే మనం సామమార్గంలో తన రాజ్యం తనకిస్తామన్న నమ్మకం తైలపునికి పోయినట్లు గ్రహించాను.

అందువల్లనే ఇలా కల్లోలాలు రేపి మన పాలనకు అపఖ్యాతి పాలు చేయాలని తైలపుడూ సోమేశ్వరుడూ, వ్యూహం పన్నినట్లు నేను తెలుసుకున్నాను."

"అసత్యం- నేను నమ్మను."

"ప్రభూ!" బసవేశ్వరుని కన్నులు పెద్దవైనాయి.

"ఏది అసత్యం?"

"నీవు చెప్పినదంతా అసత్యమే! ఇదంతా కట్టు కథ."

బసవేశ్వరుని ముఖంలో దరహాసం వెలిగింది.

"ప్రభూ! నేను అసత్యమాడుతున్నానంటారా?

ఇలాంటి మాట మీరు లోగడ ఎన్నడూ అనలేదే."

"ఎన్నడూ అనలేదు-ఎన్నడూ ఇలాంటి సంఘటనలు కూడా జరుగలేదు. విజయదశమి ఉత్సవాలలో లక్షలాది సైన్యం ముందు హత్యా ప్రయోగం బహిరంగంగా చేయబడ్డది. మొన్నటికి మొన్న అంతఃపురంలో విషప్రయోగం జరిగింది. సనాతనులంతా మన పై కత్తి కట్టారు. దానికి తోడు నీ సంఘ సంస్కరణోద్యమాలూ, వర్ణాంతర వివాహాలు మన కల్యాణనగర చరిత్రలో ఎన్నడైనా విన్నామా? దేవతలు హర్షిస్తారా?? ఇక వానలు కురిసి పంటలు పండుతాయా?" బిజ్జలుడు ఆవేశపడుతున్నాడు.

"శీలవంతుడు-ఒక మాలవాడు- కృష్ణపెద్దిని హత్య చేయడం, ఇలాంటి సంఘటన ఎన్నడైనా చాళుక్య సామ్రాజ్య చరిత్రలో జరిగిందా?"

"కాలేదు ప్రభూ! తమ రహస్య గోపనం కోసం చాళుక్య పిశాచాలే కృష్ణపెద్ది, శీలవంత, బ్రహ్మయ్యలపై విషబాణాలు ప్రయోగించారు...."

"ప్రయోగిస్తే వీరిద్దరూ తప్పించుకున్నారు- ఒక్క కృష్ణపెద్ది మాత్రమే చనిపోయాడని అంటావు- అంతేనా?"

"అంతే ప్రభూ!"

"పసిపిల్లలు కూడా నమ్మరీ కట్టు కథ!

మూడు బాణాలు వచ్చాయిట! శీలవంతుడూ, కలకేత బ్రహ్మయ్య తప్పించుకున్నారట! కృష్ణపెద్ది మాత్రం మరణించాడట! అనుభవ మంటప సభ్యులంటే పాపం విషబాణాలకు కూడా భయమే నని నాకిప్పుడే తెలుస్తున్నది. అవును మరి- వారంతా దివ్యాంగ సంభూతులూ, ప్రథమ గణమూ కదా!"

బిజ్జలుని వ్యంగ్యానికి బసవన్న ఓర్పునే సమాధానంగా ప్రదర్శించాడు.

"కృష్ణపెద్దికి లోగడ లావణ్యవతిని ఇవ్వాలని అనుకున్నారు. అదే శీలవంతునికి కృష్ణపెద్దిపై గల ద్వేషం. ద్వేషానికి చివరకొక నిండు ప్రాణాన్ని బలి తీసుకున్నాడు. భూసురుని రక్తంతో కల్యాణ నగరం తడిసింది."

"ప్రభూ! నన్ను విశ్వసించండి. శివానుభవ మంటప సభ్యులకూ, హింసకూ కలలో కూడా పొత్తు కుదరదు. అహింస మాకు కేవలం ఆదర్శమేకాదు- జీవన వ్రతం. ఈశ్వర సాక్షాత్కారానికి అది ఏకైక లక్ష్యమని మా నమ్మకం."

"చేసేవి శివపూజలు, దూరేవి దొమ్మరి గుడిసెలూ- అన్న సామెత యిందుకే పుట్టింది! హింసాత్మకమైన పనులు చేస్తూ అహింసా సూత్రాలు వల్లించే యీ రుద్రాక్షపిల్లుల వల్ల నా సామ్రాజ్యపు మనుగడకే ఇప్పుడు ముప్పు ఏర్పడింది.

ఇంతకూ అహింస అనేదొక ఆదర్శమేకాని ఎన్నడూ వాస్తవం కాదు.

జగత్తు హింసాత్మకం. చిన్న చేపనుతిని పెద్దచేప జీవిస్తున్నది.

ఎవ్వరూ ఏ హింసా చేయకుండా వుంటే మానవ జీవనం దుర్లభ మవుతుంది.

జైనం నశించడానికి కారణం మీరని మీ అనుభవమంటప సభ్యులు అనుకుంటున్నారు, కాని అది నిజం కాదు. పొలం దున్నితే నాగలికి తగిలి పురుగులు చస్తాయని వ్యవసాయాన్ని తగలబెట్టారు, దీపం పెడితే పురుగులు చస్తాయని చీకట్లో బతికారు. శత్రువును చంపితే పాపమని సామ్రాజ్యాలు ముంచారు. ఇప్పుడా అహింసా పిచ్చి వీరశైవులకు పట్టుకున్నది. మీరు నన్ను ముంచుతున్నారు."

"ప్రభూ! కోపోద్రేకం మనిషిలోని వివేకాన్ని కప్పివేస్తుంది- అద్దాన్ని మంచు కప్పినట్లుగా!

జీవులపట్ల ప్రేమలేకపోతే సృష్టిక్రమమే ఉండేది కాదు—

సర్వధర్మాలకూ దయయే మూలము.

దయయే సర్వము.

దయలేనట్టి స్వధర్మ మేమిటి??

దయాహీనుణ్ణి సంగమేశ్వరుడు చూడడు.

చరాచర సృష్టిలోని సమస్త జంతు జాలమూ ఈశ్వరుని సంతానమే!

అంతా కర్మబద్ధులమే! కర్మ అనే పదంలో కర అనే శబ్దం వుంది. కర అంటే మన భాషలో పన్ను అని అర్థం. ప్రజలు మీకు పన్ను కడుతున్నారు.

మీరు వారిని కల్యాణనగరంలో సుఖంగా జీవించేటట్టు పాలిస్తున్నారు.

అలాగే మనమంతా సంగమేశ్వరుని విశ్వ సామ్రాజ్యంలో జీవిస్తున్నాము. అందుకాయనకు మనం చెల్లింపవలసిన పన్ను పేరే 'దయ'—

భూతి దయి పచ్ఛకం కాదు- అనివార్యం.

జైనుల గూర్చి మీరు చెప్పిన వాదాలు సరియైనవి కావు.

వారు నిరీశ్వర వాదాన్ని ప్రతిపాదించారు.

అదే వారి పతనానికి కారణమైంది.

అహింస అనేదొక శుష్క ఆదర్శంకాదు ప్రభూ!

వాస్తవం!

అది సత్యయుగ ఆదర్శం.

సర్వవేద ఉపనిషత్తుల సారమూ అదే!

హింస చేయమని మీరు కాదు- సాక్షాత్తు సంగమేశ్వరుడు దిగి వచ్చి చెప్పినా అనుభవమంటప సభ్యులు హింసకు దిగరు. వారికి ఇవ్వ బడిన మానసిక ఆధ్యాత్మిక శిక్షణ అటువంటిది.

శీలవంతుడు కల్యాణనగర రత్న దీపం! అతని యెడ హింసా భావాన్ని ఊహించడం క్షీర ధారలనుండి విషాన్ని పిండాలని ప్రయ త్నించడమే అవుతుంది.

వాళ్ళు తలచుకుంటే భైరవుని కోనను ఎప్పుడో బూడిద చేసే వారు. కాని అహింసా వ్రతులు వారు. నేనే చీమకు కూడా బాధ కలుగ చేయవద్దన్నాను.

నిజా నిజాలు ప్రజలకు తెలియాలి.

అంతేకాక తైలపుణ్ణి, సోమేశ్వరుణ్ణి, చంపడం మన అభి మతం కాదు. ఏవైనా లోపాలుంటే వాటిని శిక్ష ద్వారా కాక శిక్షణ ద్వారా పరివర్తనాత్మకంగా మలచుకోవడం మన లక్ష్యం."

"నీ లక్ష్యాలూ, ఆదర్శాలు, సిద్ధాంతాలూ, చిలక పలుకులూ నా కక్కరలేదు___

అహింసా వ్రతం నీకేగాని శత్రువులకులేదు, కాబట్టి వారా హింస చేస్తూనే వుంటారు.

ఆ హింసకు నా సామ్రాజ్యమూ, నేనూ బలై పోతాను. నీవు అనుభవమంటపంలో చూస్తూ వుంటావు."

"ప్రభూ!"

"ఔను___ ఇన్ని హత్యాప్రయత్నాలు జరిగితే నీవేమి చేయ గలిగావు."

"దోషులను పట్టుకోవాలని ప్రయత్నిస్తున్నాను."

"పట్టుకొని, వాడికి పాలుబట్టి, పాదపూజ చేసి, ప్రసాద మిస్తావు. తిని వారు తిరిగి హత్యాప్రయత్నాలు చేస్తారు— దానితో మేము ముందు మీ అహింసా వ్రతానికి బలి అవుతాము."

"అంతమాట అనకండి ప్రభూ! అహింసా వ్రతమే మాకు జీవనాధారం. అందుకై బలివేదికపై అనుభవమంటప సభ్యులు వరుసగా ఆత్మాహుతి కావడానికి చిరునవ్వులతో సిద్ధంగా వున్నారు.

శీలవంతుణ్ణి శిక్షించడం ద్వారా ఒకవేళ సామాజిక పరివర్తన మీరు తీసుకు రాదలిస్తే అందుకు శీలవంతుడు తన ప్రాణాలనే జ్యోతులుగా వెలిగించి హింసాధకారాన్ని పారద్రోలి బ్రతుకు హారతి కర్పూరంలా కరిగిస్తాడు - అది నాకూ సమ్మతమే!

కాని శీలవంతుణ్ణి బంధించింది మీరు హత్యా నేరం మీద: తక్షణం అతడిని విడుదల చేయవలసిందిగా సవినయంగా వేడుకుంటున్నాను."

"అది కలలోని మాట! మొదటిసారి విజయదశమి నాడు నీ మాటమీద వదిలాను, ఫలితం ఇలా అయింది. హంతకుడుగా మారి అక్రమ వివాహం చేసుకున్నాడు. అయ్యో! అయ్యో! నా రాజ్యంలో అగ్నులిక వెలుగవు, దేవతలిక కరుణించరు—"

"ప్రభూ! మహేశ్వరుల అనుగ్రహమున్నంత వరకూ త్రిమూర్తులు కూడా ఏమీ చేయలేరు.

శివుని కన్నా మా అనుభవమంటపంలోని శివభక్తులే గొప్పవారు ప్రభూ!"

"నీ అసమర్థత శృతిమించి రాగాన పడింది-

నీ భక్తి వెర్రితలలు వేసింది-

నీలో ప్రపంచ జ్ఞానం నశించింది.

నిన్నిక ఎవ్వడూ కాపాడలేడు-

కనీసం నన్నైనా నేను కాపాడుకోవాలి కదా?"

"బిజ్జల సార్వభౌమా! కూడలి సంగమేశ్వరుని పాదసన్నిధిలో

నా బ్రతుకునొక పూజాప్రసూనంగా సమర్పించి జీవిస్తున్నప్పుడు నన్ను మంగళవాడకు పిలిపించావు. మంగళవాడలో నేను మరకత మణినన్నావు, మేరు పర్వతాన్నని అన్నావు.

తైలపుడు కాకతీయుల చేతిలో పరాజితుడై, కల్యాణనగర రాజ్యం మీ చేతిలో చిక్కగానే మీకు ప్రధానమంత్రిగా నేనుతప్ప ఎవరూ పనికిరారని అన్నావు.

'బసవన్న ద్వితీయ శంభువు-అతడు నా రాజ్యంలో ఉంటే ఈశ్వరుడు కైలాసం దిగి కల్యాణ్ వచ్చినట్టే' నన్నావు.

నా సేవలూ, నా లక్షోపలక్షల శివభక్తుల సేవలూ స్వీకరించి నీ సామ్రాజ్యాన్ని సుస్థిరపరచుకున్నావు.

ఇప్పుడు తైలపుడు సజీవంగా ఉన్నాడని తెలిసేసరికి, ఆయన సామ్రాజ్యం ఆయన కివ్వమని నేను అన్నానని మండిపడుతున్నావు.

అంతేకాదు నారాయణాచార్యులవారు మీకు దుర్బోధ చేశారని కూడా నాకు తెలుసు.

మీకు ప్రతిగా నేనూ, రాయమురారికి ప్రతిగా చెన్న బసవన్న రెండు రాజకీయ శక్తులుగా అవతరించారని ఆయన మీకు ఉపదేశించాడు.

నేను మీ సైన్యాన్ని అహింసా వ్రతంపేర నిర్వీర్యం చేస్తున్నానని కూడా చెప్పాడు...."

"ఎవరు చెప్పారు నీకీ విషయాలు? అంతఃపురం నిండా నీ పంచమాంగ దళమే వుందా?"

"ఇలాంటి విషయాలు గ్రహించటానికి అంతఃపుర పరివారం అక్కరలేదు ప్రభూ! మా అంతరంగ ధ్యానం చాలును. నారాయణా చార్యులు మమ్మలను అన్ని మాటలు అన్నా నేనాయనను ద్వేషించడంలేదు ప్రభూ!

ద్వేషం నా జీవలక్షణానికి విరుద్ధం.

నారాయణాచార్యుల వారిని నా తండ్రి మాదిరాజా రాధ్యుల వారికన్నా ఎక్కువగా గౌరవిస్తున్నాను—

విప్లవాలూ, హత్యలూ, హింసాత్మక యుద్ధాలు మీ రాజ

వంశాలకు కొత్తవికావు. చరిత్ర మొత్తం ఈ రక్తసిక్తాక్షరాలతోనే నిండివుంది-

అదే పరంపరాగతంగా చర్విత చర్వణంగా నేడూ పునరావృత్త మవుతున్నది.

బిజ్జలుడూ, తైలపుడూ, జగదేవదండనాయకుడూ వీరంతా నిమిత్తమాత్రులు - నా దృష్టి ఈ వ్యక్తుల మధ్యగల రాజకీయ స్పర్ధలకూ, రాగద్వేషాలకూ పరిమితమై వుండలేదు.

యుద్ధమెరుగని మానవ సామ్రాజ్యం కోసం- ఆయుధం నిర్మింపవలసిన అవసరంలేని యుగంకోసం-

శుద్ధ సత్వ రాజ్యమేలే నందీశ్వర శకంకోసం అనుభవ మంటప సభ్యులు తపస్సు చేస్తున్నారు. అది నేడో, రేపో, మరో పదివేల ఏళ్ళకో మానవాళిలో జరిగి తీరుతుంది.

దానినే మేము భూకైలాసం అంటాము.

అప్పుడు ఇళ్ళకు తాళాలు వుండవు.

సైన్యమూ, రక్షకభటులూ ఉండరు.

పాలకులూ, పాలితులూ అనే రెండు వర్గాలు ఉండవు.

రాజూ, రాజ్యమూ, ఎల్లలూ, ఆయుధాలు లేక ధర్మమే పాలిస్తూ, పాలింపబడుతూ వుంటుంది.

ఆ యుగావతరణం కోసం ప్రధాన మంత్రి పదవి ఉపయోగపడవచ్చునన్న ఆశతో నేనీ సామ్రాజ్యంలో ఇన్నాళ్ళూ ప్రధానిగా చేశాను. కాని ఈ పదవిలో ఉండడమే ఈ నాడు నా ఆదర్శానికి అడ్డుగోడ అయితే నాకీ పదవి అక్కరలేదు ప్రభూ!

అయితే మీ మీద నాకెలాంటి తిరస్కార భావమూ లేదు-ఇదేళ్ళుగా నన్ను స్వంత సహోదరుని కన్నా మిన్నగా గౌరవించారు. అది నా అదృష్టం.

నేను పదవిలో ఉన్నా ఉండకున్నా నా పై మీ అనురాగం యధాపూర్వకంగా కొనసాగ గలదని ఆశిస్తున్నాను....”

అని బసవేశ్వరుడు తన కిరీటాన్ని, మంత్రి లాంఛనాలనూ తీసి బిజ్జలుని ఆసనం పక్కన ఉంచాడు. అక్కడే ఉన్న ఒక లేఖను

తీసుకొని దానిపై తన పదవికి త్యాగ పత్రం వ్రాసి బిజ్జలుని ముందు ఉంచాడు.

నిర్మలంగా చిరునవ్వు నవ్వి-

"బిజ్జల సార్వభౌమా! నేను పదవి దిగిపోతున్నాను. కాబట్టి మీకు రాజకీయ ప్రత్యర్థిగా నేను నిలుస్తానన్న అనుమానాన్ని మీరు తొలగించుకొని నిశ్చింతగా విశ్రమించండి. అయితే భైరవుని కోనలో ఎవరూ లేరనీ శివ శరణులే ఇలా పిశాచాల వేషంలో అక్కడ రహస్య స్థావరమేర్పరుచుకొని మిమ్మల్ని పడ దోయాలని ప్రయత్ని స్తున్నారనీ మీరు బలంగా నమ్ముతున్నట్లు నాకు తెలుసు. అది అసత్య మని నేను వేరే చెప్ప నక్కరలేదు. తైలపుడూ, సోమేశ్వరుడూ తమ సేనాధిపతులతో సహా అరణ్యాలలోకి పారిపోయారు. సమయం కోసం నిరీక్షిస్తున్నారు. సర్వ సన్నద్ధులై జాగరూకులై ఉండండి".

బిజ్జలుని హృదయం వణికిపోయింది.

బసవన్న లేకుండా తానీ చాళుక్య సామ్రాజ్యాన్ని పరిపాలింప గలడా?

బసవన్న పాదాలపై బడి క్షమాపణ కోరుకుంటే ఒకవేళ తన త్యాగ పత్రం ఉపసంహరించుకుంటాడేమో!....

హృదయానికి బుద్ధి అడ్డు వచ్చింది.

విషప్రయోగ వంచితుడైన నారాయణాచార్యులూ, ఆయన చెప్పిన మాటలూ మళ్ళీ గుర్తుకు వచ్చాయి.

బసవన్న నిజంగా అమాయకుడేనా?

ఆయనకు నారాయణాచార్యులు చెప్పినట్లు రాజ్య కాంక్ష లేనే లేదా?

బిజ్జలుని హృదయ వృక్షాగ్రంలో, భావాల తాళ్ళతో వ్రేలాడు తున్న ఉయ్యాల, మింటినీ మంటినీ స్పృశిస్తూ నిర్విరామంగా ఊగు తున్నది.

బసవన్న రాజ భవనం నుండి నడిచి వెళ్ళిపోయాడు నిర్వి కారంగా.

బిజ్జలుని కళ్ళు ఎందుకో చీకట్లు కమ్మినట్లయింది.

గది మొత్తం అంధకారం వ్యాపించినట్లు భ్రాంతి చెందాడు.

ఆ రాత్రి—

బిజ్జలుని జీవితంలో మరొక నిద్ర లేని రాత్రి!!

# 27

బసవన్న ప్రధానమంత్రి పదవికి త్యాగ పత్రం సమర్పించాడన్న వార్త కార్చిచ్చులాగ వ్యాపించింది. కల్యాణ నగరంలోని వివిధ రాజ్యాల రాయబారులూ నిర్విరామంగా తమ తమ ప్రభుత్వాలకు ఈ వార్తను చేరవేశారు.

"బిజ్జలుని రాజ్యానికి అప్పుడే నూరేండ్లు నిండాయి. నూనె లేని దీపం వలె బసవన్న అండ, ఆధ్యాత్మికశక్తి లేని కాలచూరి వంశ పాలన ఇక కొడి కట్టక మానదు" అనుకున్నారు ప్రజలు రహస్యంగా!

భైరవుని కోనకు ఉత్తరాన ఉన్న అడవులలో సైనిక సంచలనాలు ప్రారంభమైనాయి.

ఇదిలా వుండగా తైలప చక్రవర్తి మరణించాడనే వార్త వచ్చింది.

ఈ వార్త ఎలా వచ్చిందో తెలియదు.

ఇందలి ఆంతర్యమేమిటో తెలియదు.

కాకతీయ ప్రోలుడు తైలపుణ్ణి ఓరుగల్లులో బంధించాడనీ, తర్వాత వచ్చిన రుద్రదేవుడు తైలపుని ఆరోగ్యం గూర్చి పట్టించుకోలేదనీ ఫలితంగా తైలపుడు మరణించాడనీ ఆ మృత దేహాన్ని ఎవరికి పంపాలో తెలియక వారే దహన సంస్కారాలు చేశారనీ పుకారు వ్యాపించింది.

బిజ్జలుడీ వార్త విని సంభ్రమాశ్చర్యాలకు లోనైనాడు.

కాకతీయుల రాయబారిని పిలిచి నిజా నిజాలు అడిగాడు. అతడు ఇది పూర్తిగా అసత్యమనీ - తైలపుడూ, సోమేశ్వరుడూ ఓరుగల్లులో బందీలై ఉండనే లేదనీ ఖండించాడు. తైలపుని మరణ వార్త బిజ్జలునికి కాస్త ఊరట కల్గించింది. చాళుక్యుల ఎడల అనురక్తులైన పాలితులకు దుఃఖదాయకమైంది.

పాలకులకు తెలియకుండా చాలా ఇళ్ళల్లో సంతాప తీర్మానాలు చేశారు.

అశ్రుతర్పణం విడిచారు.

"ఈ వార్తలోని నిజానిజాలు తెలుపగల సమర్థుడు బసవన్న ఒక్కడే! కాని ఆయన నెలా అడిగి తెలుసుకోవాలి?" అని బిజ్జలుడు మాట్లాడకుండా ఊరుకున్నాడు.

ఒకనాడు బిజ్జలుని అంతఃపురం ముందు గుర్రాలు సకిలిస్తూ నిలబడ్డాయి.

బాచరసు లోనికి వచ్చి ప్రభువుకు నమస్కరించి "ప్రభూ! మధువరసు గారు తమ రాజకీయ బాధ్యతల నుండి తప్పుకొంటూ తమకీ పత్రం ఇమ్మన్నారు. తమ అధికార లాంఛనాలను, భవనాన్నీ, గుర్రాల బండిని తమకు స్వాధీనం చేయమని చెప్పారు" అని మధువరసు రాజీనామాను బిజ్జలునికి సమర్పించాడు.

అది చూచేసరికి బిజ్జలునికి కోపం వచ్చింది-

"ఒక పదవిలో ఉండడానికీ ఉండకపోవడానికీ అంతా వీళ్ళ ఇష్టమేనా....ఎవరురా అక్కడ?"

"చిత్తము ప్రభూ!"

"వెళ్ళి మధువరసును బంధించండి."

"చిత్తం."

అధికారులు సైనిక సహాయంతో మధువరసును బంధించడానికి వెళ్ళిపోయారు.

బసవన్న ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేశాడన్న వార్త కల్యాణనగర పరిసర ప్రాంతాలకు విద్యుద్ఘాతం వలె సోకింది.

చాళుక్య రాజ్యంలో కొన్నివేల భక్తకూటములు ఉన్నాయి. ఇవన్నీ అనుభవ మంటపానికి అనుబంధ సంస్థలు.

ఈ భక్తకూటములన్నింటిలోను అసంతృప్తి కలిగింది.

అంతా తమ తమ నిరసనలను తెలియజేస్తూ బిజ్జలునికి తీర్మా
ను పంపారు.

సభలు బహిరంగంగానే పెట్టారు.

ఊరేగింపులు జరిపారు. బందీ అయిన శీలవంతుని ప్రతిమ, లావణ్యవతి ప్రతిమలను వైభవంగా పూల పల్లకీలలో ఊరేగించారు. కళ్యాణనగరంలో కూడా అసంతృప్తీ, ఆందోళనా దావానలంవలె వ్యాపించింది. లావణ్యవతీ శీలవంతుల చిత్రపటాలను ఊరేగించారు పుష్పమాలలతో అలంకరించి—

"బసవన్న ప్రధాన మంత్రిగా పనికి రాని రాజ్యం మాకూ పనికి రాదు."

అని ఏక వాక్య తీర్మానాన్ని సభ్యులు ఆమోదించారు.

బసవన్న ఇది గమనించాడు.

అనుభవ మంటపంలో ఒక బహిరంగ సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. లక్షలాది భక్తులు విచ్చేశారు.

మంటప అంతర్భాగం చాలక బయట తోటలో సభ పెట్టారు.

బసవేశ్వరుడు మామూలుగానే మందస్మిత వదనంతో సమావేశానికి పాదచారియై వచ్చాడు.

సభ్యులంతా జయ జయ ధ్వానాలు చేశారు. అప్పుడు బసవన్న ఇలా అన్నాడు-

"వీరమహేశ్వరులకు నా శరణులు!!

అనంత నేత్రములూ, అనంత వక్త్రములూ, అనంత బాహువులూ, అనంతపాదములూ కల పరమేశ్వరుని విరాట్స్వరూపంగా నాకీ సభ గోచరిస్తున్నది. ఈ సభముందు నతమస్తకుడనై నిలిచే సదవకాశం నాకు కలిగినందుకు ఉప్పొంగిపోతున్నాను.

శివస్వరూపులారా!

నేనీ కల్యాణ నగరానికి రావడానికి కారణం మీ పాదసేవను ఆశించే! ప్రధానమంత్రి పదవి నిమిత్తమాత్రంగా లభించింది. నిమిత్తంతోనే పోయింది. దానివల్ల నాకు వచ్చిందీ లేదు, పోయిందీ లేదు. పదవితో రానిదీ పదవితో పోనిదీ మీ పాదసేవా సౌభాగ్యం-

నాకు నాడూనేడూ నిరంతరం చిరంతనంగా ఉండనే ఉన్నది. ఇదే నాకుత్రైలోక్య పదవి-

మీ సేవాభావం లేని కైలాసం కూడా నాకు వద్దు.

బిజ్జలుడు ప్రస్తుతం అనుమానగ్రస్తుడై వున్నాడు. మన నూతనోద్యమం, దాని ఆధ్యాత్మిక జిజ్ఞాసా అర్థం చేసుకోలేక, దీనినొక రాజకీయ ఉద్యమంగా భావించి తన పదవికి ముప్పు వస్తుందేమోనని శంకిస్తున్నాడు.

మీరు వివిధ ప్రాంతాలలో చేసిన తీర్మానాలూ నిరసన సభలూ బిజ్జలుని అనుమానాన్ని బలపరిచేవిగానే ఉంటాయి గాని అనుమాన రాహిత్యానికి తోడ్పడవు.

మనం శివసామ్రాజ్య పట్టాభిషిక్తులం. మనకి లౌకిక సామ్రాజ్యాలెందుకు?

నేటినుండి మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధిగా శివభక్తులు ఎట్టి ఆందోళనా ప్రదర్శించకూడదని నేను సవినయంగా మనవి చేస్తున్నాను.

అంతేకాదు పరిస్థితులు ఇంకా విషమించవచ్చు. భైరవుని కోననుండి తైలపుని బృదం అరణ్యస్థావరాలకు తమ నివాసాన్ని మార్చింది. లోగడ తైలపుడు అనారోగ్యంతో బాధపడుతున్నట్లు కలకేత బ్రహ్మయ్యా, శీలవంతుడూ చెప్పారు. ఇప్పుడాయన పోయినట్లు వార్తలు వచ్చాయి.

ఇవి యధార్థమే కావచ్చు. తైలపుని మరణం చాళుక్యరాజులపై ప్రేమగల ప్రజలకు తీరని దుఃఖాన్ని కలిగించవచ్చు.

కాబట్టి వారు ఏవైనా అకృత్యాలకు పాల్పడవచ్చు.

వీటివల్ల సరికొత్త సమస్యలు ఉత్పన్నం కాగలవని నా మనస్సు చెపుతున్నది.

శివ శరణులారా!

మన కిది పరీక్షా సమయం! ఇంత కాలంనుండి మనం చెప్పిన మాటలు చేతలలో చూపవలసిన తరుణం వచ్చింది.

లావణ్యవతీ- శీలవంతుల వివాహంతో కొన్ని వర్గాలవారు విద్వేషాన్ని రగుల్కొల్పాలని విశ్వప్రయత్నాలు చేస్తున్నారు.

నిప్పుకు విరుగుడు నిప్పు కాదు.

విషంనుంచి విషమే పుడుతుంది.

పాల సముద్రం మధించి నప్పుడు అమృతమూ, ఐశ్వర్యాలూ, ఐరావతమూ పుట్టాయి.

అన్నిటికీ ఆశ పడ్డారు దేవతలు.

విషం పుట్టింది-

దానికి పుక్కిట పట్టినవాడు శివుడు. నేటి సమాజ మథనంలో- మనంచేసిన ప్రయోగ ఫలితంగా విషామృతాలు రెండూ పుడు తాయి—

అమృతాన్ని తాగినవాడెవడూ చిరంజీవి కాడు.

విషాన్ని పుక్కిట పట్టినవాడే మృత్యుంజయుడు.

అదే మన గురువు- పరమ దైవం సంగమేశ్వరుడు.

మనం మన ఉద్యమాలను తాత్కాలిక సుఖాల కోసం సాగించడం లేదు.

మోక్ష సామ్రాజ్యాన్ని, శాశ్వతత్వాన్ని అందుకోవడం కోసం స్వీకరించిన దీక్షా మార్గమిది.

బిజ్జలుడు- చాళుక్య సామ్రాజ్యమూ నిమిత్త మాత్రం.

సమాజం స్వయంభువు.

అది నిన్న పుట్టలేదు- రేపు నశించి పోదు.

మన మార్గం నేడు బిజ్జలునికి నచ్చక పోతే పోవచ్చు. నేడు బసవన్న ఈ ఉద్యమం కోసం ఆదర్శ బలిపీఠంపై ఒరిగిపోవచ్చు-

కాని లక్షల బసవన్నలు భవిష్యత్తులో మన సంకల్పం వల్లా- ఆచరణవల్లా, ఆదర్శం వల్లా ఉద్భవిల్లి తీరుతారు.

శాంతి వహించండి.

దయను ప్రదర్శించండి.

మిత్రుల యెడ శరణుల యెడ కాదు-

శత్రువుల ఎడల, క్షుద్రుల ఎడల, పాపుల ఎడల

దయార్ద్ర భావాన్ని చూపండి.

పాపుల కోసం మనం కార్చే కన్నీటికి విలువ

ఈ సమస్త భూలోకమూ చాలదు.

అమూల్యమైన ఆ కన్నీటితో చాళుక్య రాజ్యాన్ని తడిపి అందులోనుండి నవ సమాజ అంకురాన్ని వికసింప జేయండి.

నేడు మనం నాటిన మొక్క-రేపు రాబోయే యుగంలో పండ్లు పండుతుంది.

కులం, మతం, వర్గం, వర్ణం, ఎల్లలూ, రాజూ లేని సామ్రాజ్యం అవతరిస్తుంది—

దొంగ తనం, పాపం, హింస, దోపిడీ, స్వార్థం అనే భావాలు తెలియని మానవాళి వికసిస్తుంది.

అలాంటి నవ సమాజ వృక్షం పెరగడానికి మనం మన తను వులనే ఎరువుగా వాడుదాం! మన సంకల్పాలనే వారధులుగాకట్టి దివ్య జలాలతో తడుపుదాం!

పరాభవం, పరాజయం, మరణం, మనకు స్ఫూర్తి నిధులు, మరణమే మనకు మహార్నవమి-విజయ దశమి!!

ఈ సమాజం మన ఎడల చేసే దారుణాలనూ, అన్యాయాలనూ చిరునవ్వుతో సహిద్దాం!!

బలిదానంనుండే నవసమాజం ఉద్భవిల్లుతుంది. త్యాగంతోనే సరిక్రొత్త మానవ యుగం ఆవిర్భవిస్తుంది.

శివ శరణులారా!

ఇవన్నీ మీకు కొత్త విషయాలు కాదు.

అనుభవమంటపంలో ఇన్నేళ్ళుగా మనం నేర్చుకుంటున్న పాఠాలు ఇవే!

మీకిది శివుడిచ్చిన పరీక్ష!

తల వంచుకొని వెళ్ళిపొండి!

ఏం జరిగినా పల్లెత్తి మాట్లాడ వద్దు.

నిరసన సభలు జరుపవద్దు—

శబ్దానికి శబ్దం ప్రతి ధ్వనిస్తుంది

నిశ్శబ్దానికి దైవం ప్రతిధ్వనిస్తుంది.

ఇదే నా ఆన!!

కన్నీళ్ళను కళ్ళలోనే మింగి- క్రౌర్యాన్ని, బాధనూ, ప్రతీకారాన్ని హృదయాగ్నికాండంలో వ్రేల్చి-

మన మానస యజ్ఞానికి మనమే బలి పశువులుగా నిలబడతామని ప్రతిజ్ఞ చేయండి.

నాపై గురుత్వముంటే ఈ ప్రతిజ్ఞ సామూహికంగా చేయండి."

అంతా అహింసా ప్రతిజ్ఞ చేశారు.

బసవన్న చిరునవ్వుతో వేదిక దిగాడు.

పశువుల కాపరి వెంట తలలు వంచుకొని లక్షలాది గోగణం నడిచినట్లు భక్త గణమంతా మౌనంగా అనుభవమంటప వనం నుండి తిరుగు ముఖం పట్టింది.

బసవన్న అడుగులో అడుగు వేసుకుంటూ!

## 28

దేశద్రోహమూ, హత్యా, చట్టబద్ధ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విప్లవాన్ని రగుల్కొల్పడం, వర్ణ వ్యవస్థను నిర్మూలించి ప్రతిలోమ వివాహాన్ని జరపడం వంటి నేరాలు చేసినందుకుగాను న్యాయస్థానంలో నిలువ వలసిందిగా శీలవంతునికీ, లావణ్యవతికీ, హరళయ్య- కల్యాణమ్మలకూ, మధువరసుకూ ప్రభుత్వ పక్షాన లేఖలు అందాయి.

మాఘ బహుళ దశమి న్యాయ విచారణకై తేదీ నిర్ణంచారు.

ఆ నాడు న్యాయ స్థానం కిటకిటలాడి పోయింది.

కల్యాణ నగర ఉద్యోగులే కాక వివిధ దేశాలకు చెందిన రాయబారులూ ప్రత్యేక వ్యక్తులు ముందుగానే వచ్చి తమ తమ స్థానాలు పదిల పరచుకున్నారు.

లక్షలాది శివశరణులు ప్రవాహ రూపంలో న్యాయ స్థానానికి వచ్చారు.

అందులో కొన్ని వేల మందికి మాత్రమే ప్రవేశం లభ్యమైంది.

మిగిలిన అసంఖ్యాక భక్తగణం న్యాయస్థానం ఎదుట ఎండలో కలువల వలె నిలుచున్నారు. వాడినవి వారి ముఖాలే కాని

హృదయాలు కాదు-అవి సహస్రదళ పద్మాల వలె వికసించి ఆరు మెట్లు ఎక్కుతున్నాయి.

సమయం అయింది!!

దౌవారికుడు ఘంటిక మ్రోగించాడు.

ప్రధాన న్యాయాధిపతి మంచెనభట్టు న్యాయ సింహాసనాన్ని అలంకరించాడు.

సభలోకి బిజ్జలుడూ రాయమురారీ ప్రవేశించారు- తమ తమ ఆసనాలలో కూర్చున్నారు.

ఇంతలో సభలో ఏదో కలకలం పుట్టింది.

"తొలగిండి-తొలగిండి-దారి విడవండి" రక్షక భటులు అతి కష్టం మీద ప్రజలను పక్కకు సర్ది మార్గాన్ని ఏర్పరచారు. ప్రజా సమూహం మధ్య నుండి నడుచుకుంటూ బసవన్న లోనికి వచ్చి ప్రజలలోనే ఒక ప్రక్కగా ముందు వరుసలో కూర్చున్నాడు.

బసవన్న రావడంతో లక్షలాది ప్రజలు హర్షధ్వానాలు చేశారు.

"సద్దు- సద్దు" దౌవారికులూ, బెత్తాలవారూ, రక్షకభటులూ మందలించారు.

బిజ్జలుని పక్కనే ప్రధానమంత్రి స్థానం ఖాళీగా వుంది.

బిజ్జలుడేమీ మాట్లాడకుండా బసవన్న రావటం వెళ్ళి ప్రజల లోనే కూర్చోవడం గమనించి చూస్తూ ఊరుకున్నాడు.

"కేశవపెద్ది-కేశవపెద్ది" పెద్దగా న్యాయస్థాన భటుడు పిలిచాడు.

కేశవపెద్దిని బోను ఎక్కించారు.

ప్రమాణం చేసి కేశవపెద్ది ఇలా చెప్పాడు-

"న్యాయాధీశా! కృష్ణపెద్ది నా ఒక్కగా నొక్క కొడుకు- అతణ్ణి అనుభవ మంటప సభ్యులు హత్య చేసారు. నా కొడుకు లావణ్యవతిని ప్రేమించాడు. ఆమెను శీలవంతుడనే మాలవాడు చేసుకొని, తన ప్రేమకు అడ్డు రాకుండా ఉండేందుకై నగర శిథిలాలలో హత్య చేశారు." కేశవపెద్ది పెద్దగా ఏడ్చాడు.

"న్యాయస్థానంలో ఏడవకూడదు." మంచనభట్టు హెచ్చరించాడు.

"నీ కుమారుణ్ణి శీలవంతుడే హత్య చేశాడనడానికి ఆధారాలు ఏమైనా ఉన్నాయా?"

"ఉన్నాయి ప్రభూ! కాలచూరి సైనికులు ఉన్నారు." సైనికులను బోను ఎక్కించారు వరుసగా-

"నీ పేరు?"

"జయవర్ధనుడు."

"నీ వెందుకు ఆ సమయంలో అక్కడ ఉన్నావు?"

"నేను బిజ్జలుని రహస్య సమాచార శాఖకు చెందినవాణ్ణి. శీలవంతుడూ, కలకేతబ్రహ్మయ్యా కలిసి ముగ్ధసంగయ్య ఇంటిని స్థావరంగా చేసుకొని తరుచు జైనశిథిల మందిరాల వద్దకూ, భైరవుని కోనవద్దకు పోవడం గమనించాను. కలకేతబ్రహ్మయ్య తన ఇంద్రజాల విద్యతో తరుచు వేషాలు మార్చేవాడు కాబట్టి ఆయనను పోల్చుకోవడం చాలాకష్టమయ్యేది, కాని శీలవంతుణ్ణి తేలికగా పోల్చుకున్నాము. ఆయన తరుచు కృష్ణపెద్దిని వెన్నాడుతూ ఉండేవాడు."

"ఎందుకని? వీరిరువురికీ ఏమైనా శత్రుత్వం ఉందా?"

"కృష్ణపెద్ది శీలం మంచిది కాదు. ఆడపిల్లలను ఏడిపించడం అతనికి అలవాటు. లావణ్యవతిని కూడా అలాగే గౌరీ మందిరంవద్ద ఒకసారి ఏడిపించడమూ, అప్పుడు శీలవంతుడు జోక్యం చేసుకోవడమూ జరిగింది. నాటినుండి వీరి శత్రుత్వాలు ప్రారంభమైనాయి."

"కృష్ణపెద్ది ఆ రాత్రివేళ ఆ శిథిలాల వద్దకు ఎందుకు వచ్చాడు?" మంచనభట్టారకుడు ప్రశ్నించాడు.

"కృష్ణపెద్దికి భైరవుని కోనలోని రహస్య దళాలకు సంబంధం వుంది."

సభ చెవులు రిక్కించుకొని వింటున్నది. చీమ చిటుకుమంటే వినబడేటంత నిశ్శబ్దం.

"అందుకు ఆధారాలేమిటి?"

"కృష్ణపెద్దియే ముసుగు మనిషి అని మా రహస్య విభాగ శాఖ నిర్ధారించింది."

సభలో కలకలం- హర్షధ్వానాలు.

"సద్దు-సద్దు."

"అయితే ముసుగు మనిషిని శీలవంతుడ్ని ఎలా చంపాడు?"

భైరవుని కోనలో ఉన్నది తైలపుని వర్గమని శీలవంతాదులు అంటున్నారు. అందుకు తగిన ఆధారాలు మేము సంపాదించ లేక పోయాము. మేము భైరవుని కోనను ముట్టడించేసరికే అక్కడ ఎవరూ లేకుండా పోయారు. కాని అందులో స్థావరాలు ఏర్పరచుకొని కొంతకాలంగా కొంత పటాలం వున్నట్లు సాక్ష్యాలు దొరికాయి-

'అది తైలపుని పటాలమా? లేక కలకేతబ్రహ్మయ్యా శీల వంతులకు ఏవైనా వీరభద్ర పటాలాలు ఉన్నాయా?' అని నిర్ధారణ చేయ లేకపోతున్నాము" అన్నాడు జయవర్ధనుడు.

"అయితే తనతో శత్రుత్వం కలిగిన శీలవంతుని పటాలాలే భైరవుని కోనలో ఉన్నట్లయితే వాటితో కృష్ణపెద్ది ఎలా సంబంధం పెట్టుకొంటాడు? ఇది హేతు వాదానికి విరుద్ధం కాదా?"

"ఏమో- తెలియదు. కృష్ణపెద్దికి శీలవంతునిపై మాత్రమే ద్వేషంకాని మిగిలిన వారి మీద లేదు కదా!"

"సరే! శీలవంతుడు కృష్ణపెద్దిని ఎలా చంపాడు?"

"బాణంతో కొట్టి...."

"బాణ ప్రయోగం ఎంత దూరం నుండి జరిగింది?"

మంచనభట్టారకుని ప్రశ్నతో జయవర్ధనుడు కలవరపడ్డాడు.

ఆ ప్రశ్నకు జవాబు ఏమి చెప్పాలో అతనికి తెలియలేదు.

మంచెనభట్టారకుడు నవ్వి-

"కనీసం పది నుండి ఇరవై అడుగుల దూరానికి పైన ఉంచేనే బాణ ప్రయోగానికి అవకాశం ఉంటుంది- అవునా?"

"అవును."

"అలాంటప్పుడు పక్కనే వున్న బ్రహ్మయ్యా, శీలవంతుడూ బాణాలతో కృష్ణపెద్దిని ఎలా చంపారు?"

సభలో మళ్ళీ హర్ష ధ్వానాలు.

జయవర్ధనుడు బిజ్జలుని ముఖం చూచాడు.

బిజ్జలుడు ఏమీ మాట్లాడకుండా తల వంచుకున్నాడు.

"బాణాలను శీలవంతుని ముఠా వారు దూరం నుంచి ప్రయోగించారు. బాణాలు సరిగా తగిలాయో లేవోనని శీలవంతుడూ.

బ్రహ్మయ్యా చూడడానికి దగ్గరకు వచ్చారు. అప్పుడు మేము బంధించాము."

"మీకు దొరికిన బాణాలెన్ని?"

"మూడు."

"తక్కిన రెండూ ఎందుకు వేయబడ్డట్టు?"

"ఒకటికాకపోతే ఒకటైనా తగలక పోతుందా?. అని మూడూ శీలవంతుని మనుషులే కృష్ణపెద్దిపై వేసి వుండవచ్చు"

"ఇంకా చెప్పదలచుకున్నదేమైనా ఉందా?"

"ఏమీ లేదు" అని జయవర్ధనుడు విషలిప్తమైన మూడు బాణాలను న్యాయస్థానానికి సమర్పించాడు.

తర్వాత చేతులకు పంకెళ్ళువేసి హరళయ్యనూ, కల్యాణమ్మనూ బోను ఎక్కించారు- ఒకరి తర్వాత ఒకరిని.

"నీ పేరు?"

"హరళయ్య."

"నివాసం?"

"సంగమేశ్వరనగర్."

"నీ వృత్తి?"

"చెప్పులు కుట్టడం."

"శీలవంతుడు నీ కొడుకేనా?"

"ఔను."

"అతడు లావణ్యవతిని వివాహం చేసుకోవడానికి నీవు అంగీకరించావా?"

"అంగీకరించాను."

"ఎందువల్ల?"

"మా ఇరువురిదీ ఒకే కులం కావడంవల్ల."

సభలో కలకలం——

"అంటే?"

"అంటే అనుభవమంటప సభ్యులను వీరశైవులు అంటారు. వారికి జన్మస్థిరమైన కులాలు ఉండవు. శాంభవదీక్ష స్వీకరించిన

వారందరిదీ ఒకే కులం. అది సంగమేశ్వరుని కులం. ఆ దృష్ట్యా నేను ఈ వివాహానికి అంగీకరించాను."

"లావణ్యవతిని నీ కోడలు చేసుకోవడంద్వారా నీవు అగ్రకులాలను అవమానించాలనే సంకల్పంతో ఉన్నట్టు ఆరోపణ వచ్చింది- నిజమేనా?"

"నిజంకాదు - నాకు ఎవరినీ అవమానించాలనే సంకల్పం లేదు___"

"ఇలాంటి వివాహాలు లోగడ ఎప్పుడైనా జరిగాయా?"

"చాళుక్యసామ్రాజ్యంలో జరుగలేదుకాని -తత్పూర్వం...."

"చాళుక్య సామ్రాజ్యంలో జరిగాయా?"

"లేదు___"

"చాలు___" మాంచనభట్టారకుడు ఇవే ప్రశ్నలు కల్యాణమ్మను వేశాడు.

దాదాపు ఇవే సమాధానాలు ఆమె చెప్పింది.

తర్వాత మధువరసును బోను ఎక్కించారు.

"నీ పేరు?"

"మధువరసు."

"నీ వృత్తి?"

"ఇటీవలదాకా రాజకీయాలు."

"లావణ్యవతి నీ కుమార్తెయేనా?"

"ఔను."

"మీరు బ్రాహ్మణులేనా?"

"కాదు వీరశైవులం."

సభలో కలకలం.

"జన్మసిద్ధంగా నీ కులమేమిటి?"

"జన్మసిద్ధంగానే వీరశైవుణ్ణి___"

"పుట్టుకతో?"

"ఔను పుట్టుకతోనే___"

"న్యాయస్థానం ముందు అబద్ధమాడనని ప్రమాణం చేశావు కదా?" ప్రభుత్వ న్యాయవాది హెచ్చరించాడు.

"శాంభవీ దీక్ష తీసుకోగానే మానవుడు పునర్జన్మ ఎత్తినట్లు లెక్క. కాబట్టి ఈ జన్మలో నేను వీరశైవుణ్ణని నిజం చెప్పాను, పూర్వజన్మలో నేను బ్రాహ్మణుణ్ణి."

సభలో మళ్ళీ కలకలం.

"వీరశైవంలోని వర్ణాంతర వివాహాలు మన న్యాయస్థానానికి విరుద్ధం కావా?"

"కావనుకుంటాను. వీరశైవం మన అధికారిక మతం. వీరశైవం ఆంధ్రదేశంలో కాకతీయుల అధికారిక మతం. మీరనే వర్ణాంతర వివాహాలు శైవదీక్ష తర్వాత అక్కడా ఇక్కడా జరగవచ్చు."

"అబద్ధం." బిజ్జలుడు లేచి నిలుచున్నాడు.

"మీరేమైనా చెప్పదలచారా?"

"ఔను" అన్నాడు బిజ్జలుడు,

"అయితే దయచేసి కొంచెం ఆగండి. మధువరసుపై విచారణ ముగిశాక చెప్పవచ్చు."

బిజ్జలుడు తిరిగి తన స్థానంలో కూర్చున్నాడు.

"లావణ్యవతి శీలవంతుణ్ని వివాహం చేసుకోడానికి మీరు అంగీకరించారా?"

"ఔను."

"అది తప్పని మీకు అనిపించలేదా?"

"ఎలా తప్పు?"

"మనుధర్మ స్మృతికి విరుద్ధంకాదా?"

"ధర్మ స్మృతులు సర్వకాలకాలు కావు. ఒక్కొక్క కాలానికి ఒక్కొక్క ధర్మ స్మృతి వర్తిస్తుంది. పైగా మాదిప్పుడు కొత్త మతం- కొత్త కులం. మీ స్మృతులు వర్తించవు" అన్నాడు మధువరసు.

"చాలు" అన్నాడు మంచనభట్టారకుడు.

మధువరసుకు సంకెళ్ళువేసి తీసుకొనిపోయారు.

"ప్రభూ! ఇప్పుడు మీరు చెప్పదలచుకున్నదేమిటో చెప్ప వచ్చు" అన్నాడు మంచనభట్టారకుడు.

బిజ్జలుడు బోనులో నిలబడ్డాడు.

సభ మొత్తం కరతాళ ధ్వనులు చేసింది.

ప్రభువు బోనులో నిలబడటం కాలచూరి వంశచరిత్రలో ఇదే మొదటి పర్యాయం.

"మీరు చెప్పదలుచుకున్నదేమిటి?"

"నేను శైవుణ్ణి. మా పూర్వీకులలో కొన్ని తరాలకుముందు జైనులు ఉండేవారు. అయితే నాకు శైవ, జైన, వైదికమతాల భేదం లేదు. అందరూ సమానమే! శైవంపై ఈ దృష్ట్యా నాకు అభిమానం ఉన్నా, శైవం మాత్రం నేను రాజమతంగా ప్రకటించ లేదు. రాజు శైవుడే కాని రాజమతం శైవం కాదు" అన్నాడు బిజ్జలుడు.

సభలోని శైవేతరులంతా చప్పట్లు కొట్టారు.

"సద్దు—సద్దు." రక్షకభటులు సర్దుబాటు.

"వీరశైవంలో వర్ణాంతర వివాహాలున్నాయా?"

"ఏమో తెలియదు. ఈ మతం బసవేశ్వరుడు తనకైతాను సృష్టించాడు."

"కాదు—కాదు" అని సభలోని శరణులంతా అరిచారు.

"సద్దు—సద్దు." రక్షకభటులు అదిలించారు.

"పైగా వీరశైవంలోని వర్ణాంతర వివాహాలను వీరశైవ పీఠాధిపతులే ఖండించారు" అన్నాడు బిజ్జలుడు.

సభ నిశ్చేష్టమైపోయింది.

ఇంతవరకు ఏ మాత్రం చలనం లేకుండా నిర్లిప్తంగా వింటున్న బసవేశ్వరుడు ఈ మాటతో ఉలిక్కిపడి కొంచెం ముందుకు వంగి ఆసక్తితో వినసాగాడు.

"ఎవరు ఖండించారు?" మంచనభట్టారకుడు ప్రశ్నించాడు.

"మల్లికార్జున పండితారాధ్యుడు. ఆంధ్రదేశంలోని వీరశైవ మత పీఠాధిపతి- ఇదిగో దయచేసి ఈ లేఖ పరిశీలించండి" అని బిజ్జలుడు న్యాయమూర్తికి ఒక లేఖ నిచ్చాడు. న్యాయమూర్తి ఆ లేఖను చదివాడు.

"వీరశైవ మత పునరుద్ధారకా! భక్త భండారి- బసవేశ్వర ద్వితీయ శంభుని పాదపద్మములకు కృతానేక శరణులతో మల్లికార్జున పండితారాధ్యుడు చేసికొనే విన్నపములు.

నిన్ను దర్శించుకోవాలన్న కోరికతో, నేను సాగర తీరం నుండి త్రిలింగ భూమి మీదుగా వనపురి వరకు వచ్చాను. ఇంతలో కల్యాణ నగరంలో నీవు సుప్రసిద్ధ వర్ణాంతర వివాహం చేసినట్లు వార్త అందింది. అది విని నేను ఆశ్చర్యపోయాను. నీవు చేసిన పని శాస్త్ర విరుద్ధం. నీతో ఈ విషయమై నేను చర్చింపదలచాను. నీవు సాక్షాత్తు శివ స్వరూపునివి. నీ దర్శనం సర్వ పాపహరం. కాని మనం లౌకిక ధర్మాన్ని వేదవిహిత సనాతనాచారాన్ని ప్రతిఘటించ రాదు కదా!

"భక్తి మీది వలపు, బ్రాహ్మంబుతో పొత్తు బాయలేను నేను బసవలింగ!"

ఇట్లు నీ పాద పద్మములకు సహస్రానేక శరణులతో.

మల్లికార్జున పండితారాధ్యుడు.

వనపురి.

(పీఠాధిపతి ముద్రిక) (ఆంధ్రశ్వేత శైవ మహా పీఠాధిపతి)

ఈ లేఖతో సభలో కలవరం చెలరేగింది. దానిని స్వాధీనంలోకి తీసుకు రావడానికి రక్షక భటులకు వశం కాలేదు.

"ఇది బసవేశ్వరునికి మల్లికార్జున పండితారాధ్యుల వారు వ్యక్తిగతంగా వ్రాసిన లేఖ-దీనిని ప్రభుత్వం ఎలా సంపాదించింది?" చెన్న బసవన్న లేచి ప్రశ్నించాడు.

"ఔను-ఔను" అని శివశరణులు అరిచారు.

"ప్రభువుకు రాజ్యానికి వస్తూ పోతూ వుండే ఏ సమాచారా న్నైనా స్వాధీనం చేసుకునే అధికారం వుంది" అన్నాడు బిజ్జలుడు కోపంగా.

సభలో గందరగోళం చెలరేగింది.

"నా అనుమతి లేకుండా ఎవరికి వారే లేచి మాట్లాడుతున్నారు. ఇది న్యాయ స్థాన సంప్రదాయానికి విరుద్ధం. ఈ కల్లోలంలో నేను న్యాయస్థానాన్ని నిర్వహించడం కష్టం. తిరిగి రేపు వాద ప్రతి వాదాలు కొనసాగుతాయి. నేటికి శలవు" అని మంచెనభట్టారుకుడు లేచాడు. న్యాయ స్థాన ఘంటిక గణగణ మ్రోగింది.

# 29

నిన్నటి అనుభవాన్ని బట్టి న్యాయస్థానానికి ప్రజా ప్రవేశాన్ని నిషే ధించారు.

అందువల్ల లక్షలాది ప్రజలు న్యాయస్థానం వెలుపలే కూర్చు న్నారు.

అనుభవమంటప సభ్యులలో బసవేశ్వరుణ్ణి, చెన్న బసవన్నను, అక్కనాగమ్మను మాత్రం లోనికి అనుమతించారు. అయితే చెన్న బస వన్న మాత్రం 'నా అనుభవమండప భక్తులు లేకుండా నేను న్యాయ స్థానానికి కాదు కదా కైలాసానికి కూడా పోను' అని వారితో బాటే బయటనే కూర్చున్నాడు.

మళ్ళీ విచారణ ప్రారంభమైంది.

లావణ్యవతిని విచారణ చేసారు.

తాను హృదయ పూర్వకంగా ఎవరి ఒత్తిడీ, ప్రేరణా లేకుం డానే శీలవంతుణ్ణి వివాహ మాడినట్లు చెప్పింది.

"ఇది ధర్మ శాస్త్ర విరుద్ధం కాదా?" అన్నాడు మంచనభట్టా రకుడు.

"సిద్ధాంత శిఖామణి ప్రకారం ఇది సత్యమైనదే!" అన్నది లావణ్యవతి.

"నీవు ధర్మశాస్త్రాలు చదివావా?"

"చదివాను. ఉపనిషత్తులూ, గీతా, సిద్ధాంత శిఖామణీ- అక్కదేవిగారి వద్ద అధ్యయనం చేశాను."

"మరి గీతలో చాతుర్వర్ణాలను తానే సృష్టించానని భగవంతుడు చెప్పాడు కదా?"

"చెప్పాడు, కాని ఆ వాక్యం క్రిందనే గుణ కర్మాల ననుసరించి సృష్టించానన్నాడు. కాని జన్మ ననుసరించి సృష్టించానని అనలేదు. ఈ విషయాన్ని బసవేశ్వరుల వారు సవ్యాఖ్యానంగా ఎన్నో సార్లు అనుభవ మండపంలో వివరించారు. నేటి వేదమతం స్త్రీలకు చదువు సంధ్యలను నిషేధించింది. కాని అనుభవ మంటపం స్త్రీ స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది. పురుషునితో సమానంగా స్త్రీలకూ అక్కడ సమస్త విద్యలూ నేర్పుతారు. అనుభవ మంటపం వల్లనే నాకీ అదృష్టం కలిగింది___

పుట్టను కొడితే లోపలి పాము చావదు- పరిశుద్ధాంతఃకరణ లేకుండా కేవలం జపతపాదుల చేసిన ఎట్టి వర్ణస్థునికైనా మోక్షం లభించదని బసవన్నగారు చెప్పారు."

మంచనభట్టారకుడు ఏదో వ్రాసుకొని "ఆఁ- మీ బసవన్న గారు ఇంకేమీ చెప్పారు?" అని ప్రశ్నించాడు.

ఎదురుగానే కూర్చుని వున్న బసవేశ్వరుడు మౌన గంభీర ముద్రతో నిశ్శబ్దంగా అంతా వింటున్నాడు.

"మా బసవేశ్వరులవారుఅనుభవ మంటపంలో మాకు ఇంకా ఇలా బోధించారు-

తామ్రపత్రాన్ని పరుసవేది తాకితే అది రాగి లక్షణాలను కోల్పోయి బంగారమైనట్లే శివానుభవం వల్ల శాంభవీ దీక్షను పొందిన ఏ కులస్థుడైనా ఉత్తమకులస్థుడే అవుతాడని బసవన్నగారు చెప్పారు.

బ్రాహ్మ్యమన్నది ఒక ఆదర్శం-కులం కాదు. వేదజ్ఞులు ఎవరిని బ్రహ్మమంటున్నారో వీరే శైవులు ఆ పరబ్రహ్మానే 'లింగ' మంటున్నారు- 'శివు' డంటున్నారు.

ఒకడు అగ్రవర్ణంలో పుట్టి నీచు భుజించి మధుపానం చేసి వ్యభిచరిస్తే అతడు మాలవాడు-మాదిగవాడు.

ఈ లక్షణాలన్నీ గల కృష్ణపెద్ది అంత్యకులస్థుడని నా జ్ఞానం.

అదే మా కులంలో పుట్టి మదమాంస విసర్జనచేసి, సర్వభూత హితం కోరుతూ, దయ, సత్యము, అహింస, త్యాగములను వ్రతాలుగా స్వీకరించిన వాడే ఉత్తమ కులస్థుడు. ఆ దృష్ట్యా శీలవంతుడు అగ్ర కులస్థుడని బసవన్నగారే తీర్మానించారు.

'సప్తధాతు సమం పిండం
సమయోని సముద్భవం

ఆత్మ జీవ నముత్పన్నం
వర్ణానాం కింప్రయోజనం?' అని శాస్త్రాలలో చెప్పబడి వుంది.

అందరూ మావిలోనుండే పిండరూపంలో జన్మిస్తున్నారు. అందరి రక్త మాంసాలూ సమానమే. ఇక వివిధ వర్ణములను లౌకికంగా నిర్ణయించి ప్రయోజనమేమిటి?

కాచినవాడు కమ్మరి-ఉతికినవాడు చాకలి- నేసినవాడు సాలె-వేదము చదివిన బ్రాహ్మణుడు. వృత్తుల ననుసరించి ఏర్పడ్డ కులములివి. ఇవి శాశ్వతములు కావు, ఆదరణీయములు కావని బసవన్నగారు మాకు బోధించారు."

మంచనభట్టారకుడు ఇదంతా వ్రాసుకున్నాడు. లావణ్యవతి ఇంకా ఇలా చెప్పింది-

"కాబట్టి పరమ భక్తుడైన పిరియాళణ్ణి కోమటి అనవచ్చునా? మహాభక్తుడైన మడేలు మాచయ్యను చాకలి అనతగునా? కక్కయ్య, హరళయ్య, శీలవంతులను అస్పృశ్యులనడం మహాపాపం. పరమ మాహేశ్వరుడు మేదరి చెన్నయ్య కులముచేత హీనుడైతే, నేను బ్రాహ్మణ జన్మమెత్తినా చండాలునితోనే సమానమని బసవన్నగారు ప్రవచించారు.

ఇక వేద శాస్త్రాల మాట అంటారా! సమస్త వేదములను విభజించిన వేదవ్యాసుడు బోయ వనితకు పుట్టాడు. మార్కండేయ మహర్షి మాలకన్య కుమారుడు. మండోదరి కప్పలమ్ముకుని జీవించే వాని కూతురు. అగస్త్యుడు కిరాతకుని కొడుకు. దూర్వాసుడు ముచ్చెగ, కశ్యపమహర్షి కమ్మరి, కౌండిన్య మహర్షి మంగలి. అయితే జన్మచేత కాక కర్మచేతనే వీరంతా మహర్షులైనారు. అలాగే హరళయ్యా, శీలవంతుడూ తమ భక్తిచేత బ్రాహ్మణునికన్నా ఉత్తమ కులస్థులైనారని బసవన్నగారు ప్రవచించారు.

అరుంధతికి కులమేది?

అగస్త్యునికి కులమేది?

వాల్మీకికి కులమేది?

వ్యాసునికి కులమేది?

మీ ధర్మశాస్త్రాలు రచించిన వారంతా హీనకులస్తులే- గుణము చేతనే వారు పరమేశ్వరుని మెప్పించారు. అటువంటి సంప్రదాయ మున్నప్పుడు అనుభవమంటపంతో జరిగిన వివాహం హీన వివాహం, ప్రతిలోమ వివాహం ఎలా అవుతుంది?

పైగా చాతుర్వర్ణ వ్యవస్థ వీరశైవంలో లేదు. బౌద్ధులలో, కులాలు లేనట్లే వీరశైవులలోనూ లేవు. కాబట్టి అనుభవ మంటప సభ్యులలో కులవిచారణ చేయడం తప్పు."

"ఇదంతా కూడా బసవన్నగారే చెప్పారా?" మంచనభట్టారకుడు ప్రశ్నించాడు.

"ఔను. బసవన్న గారే చెప్పారు" అన్నది లావణ్యవతి.

"సరే! నీ విక వెళ్ళవచ్చు."

లావణ్యవతికి సంకెళ్ళువేసి తీసుకొని పోయారు. తరువాత శీలవంతుణ్ణి, కలకేతబ్రహ్మయ్యను విచారించారు.

"భైరవుని కోనతో మీకుగల సంబంధమేమిటి?"

"బసవన్నగారి అజ్ఞానుసారం మేము ప్రయత్నించి రాజ్యంలో విప్లవం రేపే అరాజక శక్తులు భైరవుని కోనలో ఉన్న సంగతిని పసిగట్టాము."

"ఎవరా శక్తులు?"

"చాళుక్యులు, బౌద్ధులు, జైనులు, అద్వైతులు, చార్వాకులు, వైష్ణవులు, మరికొందరు విదేశీ గూఢచారులు."

"దీనికి సాక్ష్య మేమిటి?"

"మొదటి విషలిప్తబాణం చాళుక్య శిల్పంతో వున్నది. మొన్నటి మూడు బాణాలూ అదే చాళుక్యశిల్పంతో ఉన్నాయి గమనించండి."

మంచెన భట్టారకుడు బాణాలు తెప్పించి పరీక్షించాడు. వాటిపై చాళుక్య శిల్పం వుంది.

"మీరు కృష్ణపెద్దిని హత్య చేశారనడం నిజమేనా?"

"కాదు. చాళుక్యులే కృష్ణపెద్దిని తమ రాజ్య కాంక్షలో ఒక పావుగా వాడుకున్నారు. వారే అతణ్ణి చంపివేశారు. ఇదొక రాజకీయ తంత్రం. మేము భక్తులం- అహింస మా వ్రతం."

"నీవు లావణ్యవతిని వివాహం చేసుకున్నావా?"

"ఔను." శీలవంతుడు సమాధానమిచ్చాడు.

"అది తప్పని నీకు అనిపించలేదా?"

"తప్పు కాదని అనుభవమంటప శిక్షణ చెప్పింది. బసవన్న గారు ఆశీర్వదించారు- అంటే పరమేశ్వరుడు ఆశీర్వదించినట్లే కదా!"

"అగ్ర కులాల వారిని అవమానించడం కోసం నీ వీ పని చేశావని ఆరోపణ- నిజమేనా?"

"అబద్ధం. అవమానించాలనే సంకల్పం అనుభవమంటప సభ్యులకు రానేర్వాదు. నిజానికి ఈ వివాహం వల్ల మీరనుకునే భౌతిక సుఖాలు మేమేమీ పొందలేదు. మధుపయ్యగారు మంత్రి పదవి వది లారు. సంకెళ్ళతో అంతా కారాగృహం పాలైనాము. అయినా మాకు చింతలేదు. శివానుభవం పొందడానికి అనుభవమంటపమే అక్కర లేదు- కారాగృహమైనా అదే మేము మందిరంగా భావించుకోగలము."

శీలవంతుని ఈ మాటలతో బసవేశ్వరుని కన్నులు దయా ర్ద్రిము లైనాయి.

తన పై ఉత్తరీయంతో కన్నీలు తుడుచుకున్నాడు!

"బ్రహ్మయ్యా! నీవు ఇంద్రజాలివా?"

"ఔను, న్యాయమూర్తీ!"

"ఏదీ. నీ విద్య ప్రదర్శించు?"

కలకేత బ్రహ్మయ్య మరుక్షణంలో కృష్ణపెద్ది నడిచివస్తున్నట్లుగా ప్రదర్శించాడు. చాళుక్య యువరాజు సోమేశ్వరుని రూపం ప్రదర్శించాడు.

బిజ్జలుడు, రాయమురారి భయపడి పోయారు.

"న్యాయమూర్తీ! ఈ బహురూప ధారణను ముగించమనండి." బిజ్జలుడు వేడుకున్నాడు.

"బ్రహ్మయ్యా! నీ విక వెళ్ళ వచ్చు."

సంకెళ్ళు వేసి వారిని తీసుకొని పోయారు.

"సంకెళ్ళు వేయకపోయినా ఇంకా విచారించ వలసిన నేరస్థుడు మరొకడు ఉన్నాడు. ఆయన బసవేశ్వరుడు! బసవేశ్వరా! నీవు బోను ఎక్కవలసి వుంటుంది."

సభలో ఉన్న కొద్దిమందిలోనూ ఉద్రిక్తత ప్రబలింది.

బిజ్జలుని గుండె వేగం హెచ్చింది.

మంచన భట్టారకుని చేయి వణుకుతున్నది.

బసవన్న మాత్రం చాలా నిర్లిప్తంగా వచ్చి బోను ఎక్కి ప్రమాణం స్వీకరించాడు.

"ఇంతకు ముందు లావణ్యవతీ, మధువయ్యా, హరళయ్యా, కల్యాణమ్మ, శీలవంతులు చెప్పిన మాటలన్నీ యథార్థమేనని అంగీకరిస్తున్నావా?"

"అన్నీ యథార్థాలు కావు...."

బిజ్జలుడు కనులు పెద్దవి చేసి చూశాడు.

"ఏవి యథార్థాలు కావు?"

"వారు చెప్పిన తక్కిన అంశాలన్నీ సత్యాలే. కాని వారు నా గూర్చి మహాత్ముడనీ, ద్వితీయ శంభుడనీ, నేనే శివ దూతననీ

చేసిన ప్రశంసలన్నీ అసత్యాలు. నేను వారి పాద సేవకుణ్ణి, కింకరుణ్ణి, శరణుణ్ణి, కేవలం ప్రచారకుణ్ణి- పరిచారకుణ్ణి నేను."

మంచెనభట్టారకుడు ఒక్క క్షణం మౌనం వహించాడు.

"ప్రధానమంత్రిగా నీవు మన రాజ్య ధర్మాన్ని పోషించవలసింది పోనిచ్చి, భంగం కలిగించావని ఆరోపణ- దీనికి నీ సమాధానమేమిటి?"

"న్యాయమూర్తీ! నేను మంగళవాడలో ఉన్నప్పుడు బిజ్జలుడు నన్ను ప్రధానిగా ఉండమని కబురు పంపాడు. నాకీ రాజకీయాలు వృత్తి రీత్యా. ప్రవృత్తి రీత్యా ఇష్టం లేదు. కాని శివశరణులూ, సంగమేశ్వరుడూ నన్ను ప్రధానమంత్రి పదవి స్వీకరించమని ప్రోత్సహించారు. నూతన ధర్మ వ్యవస్థను స్థాపించేందుకు ఈ పదవి ఉపయుక్తమవుతుందని నేను దీనిని స్వీకరించాను. ఆనాడు నేను బిజ్జలునితో ___

'శివకార్యానికి ఏనాడు భంగం వాటిల్లుతుందో ఆనాడు నేనీ పదవిని త్యజిస్తానని' చెప్పాను.

అందుకు అంగీకరించి బిజ్జలుడు నన్ను కల్యాణనగరానికి పిలిపించాడు-

నిన్నటివరకూ నేను చేసిన ప్రతి పనీ ప్రభువు ప్రశంసలనందుకున్నది. నేడెందుకో నా మీద ఆయనకు దయ తప్పింది. అందుకు కారణాలు ఏవైనప్పటికీ బిజ్జలుని శ్రేయస్సునే నేను నిరంతరం కోరుకొంటున్నాను.

అయితే ప్రధాన మంత్రిగా ఎన్నడూ నేను నా బాధ్యతలను విస్మరించలేదని మాత్రం మనవి చేసుకొంటున్నాను."

"వర్ణాంతర వివాహాలు నీవు ప్రోత్సహించావనడం నిజమేనా?"

"నిజం కాదు."

మంచనభట్టు తలపైకెత్తి చూచాడు.

"అనుభవ మంటపంలోని సభ్యులంతా ఒకే వర్ణస్థులు. వారిది ఈశ్వర వర్ణం, ఈశ్వరకులం, ఈశ్వర గోత్రం. కాబట్టి ఒకే వర్ణస్థుల

మధ్య వివాహం జరుగుతున్నది. శాంభవీ దీక్ష స్వీకరించని శైవేతరునితో మేము వివాహం జరిపినట్లయితే అది వర్ణాంతర వివాహమవుతుంది. వర్ణాంతర వివాహం నేను కలలో ఇలలో కూడా అంగీకరించను."

"నీవు వేదశాస్త్ర ధర్మాలను ద్వేషిస్తున్నావని మరో ఆరోపణ."

"అది కూడా నిజం కాదు. వేదాలలో పశువధ చెప్పబడి వుండలేదు. ఉపనిషత్తులు జన్మననుసరించినా కులాలను అంగీకరించవు. వేశ్యాపుత్రుడైన సత్యకామజాబిలి ఉపనిషత్కారుడై మహర్షిత్వాన్ని పొందాడు. రాజూ, చర్మకారుడూ, బండితోలే సూతుడూ అంతా ఉపనిషత్తులు ప్రవచించిన మహర్షులే. అశ్వ శబ్దానికీ, గో శబ్దానికీ శాంతి అనీ, తేజస్సు అనీ అర్థం. అవి కుండలినీ యోగానికీ, షట్స్థల సిద్ధాంతానికీ సంకేతాలు. అంతే కాని మేకలనూ గుర్రాలను చంపడం అజ్ఞానం.

నేను అనుభవ మంటపంలో వేదాలకు, ఉపనిషత్తులకు సరియైన వ్యాఖ్యానం ఇస్తున్నాను.

నాది నిజమైన వైదికమతం-వేదోద్ధారణ నా లక్ష్యం.

మూఢాచారపరులకు అది నచ్చకపోతే, వారిపై నాకు ద్వేషం లేదు. కాని ఎవరి సంతృప్తికోసమూ నేను నా ఈశ్వర మార్గాన్ని మార్చుకోలేను. నేడు బిజ్జలునికి భయపడితే రేపు పరమేశ్వరుని ముందు ఎలా నిలబడగలను?

మంచనభట్టారకుని, న్యాయస్థానంలో అసత్యం చెప్పి శిక్ష తప్పించుకొంటే, రేపు పరమేశ్వరుడు బోనులో నిలబెట్టినప్పుడు ఆ శిక్ష ఎలా తప్పించుకోగలను?"

"మీ పీఠాధిపతి మల్లికార్జున పండితారాధ్యులు నీ సిద్ధాంతాన్ని ఖండిస్తూ వ్రాసిన ఉత్తరం అసత్యమా?"

"సత్యమే కావచ్చు! కాని ఒక చిన్న భేదం ఉంది. మల్లికార్జున పండితుడు ఆరాధ్య బ్రాహ్మణ సంప్రదాయాన్ని ప్రచారం చేస్తున్నాడు. దానిని శ్రౌతశైవం అంటారు. నాది వీరశైవం. బ్రాహ్మణులూ, వైశ్యులూ, క్షత్రియులూ, శూద్రులూ అనే నాలుగు వర్ణాలు ఉండాలని

మల్లికార్జున పండితుని మతం-అలాకాక ఒక్క బ్రాహ్మణ వర్గమే ఉండాలని నా వాదం. సమాజంలో శూద్రులూ, క్షుద్రులూ, అస్పృశ్యులూ, పతితులూ అనే భిన్న భిన్న వర్ణాలు ఉండడానికి నేను అంగీకరించను. అందరూ బ్రాహ్మణులేనని నా మతం. ఈశ్వరుని సృష్టిలో అంతా సమానమే.

అందరూ ఒకే అగ్రకులానికి చెందినవారు-ఆ కులం ఈశ్వర కులం-సంగమేశ్వరకులం- అదే నామతం."

"నీ నిర్ణయం సమాజంలో విప్లవాన్ని తీసుకొని వస్తుంది."

"మానవతామతం ఎప్పుడూ సంఘర్షణను ఎదుర్కోక తప్పదు. ఉలి దెబ్బలు తిన్నప్పుడే రాయి పూజా విగ్రహమవుతుంది. నదిలో దొర్లి దొర్లి అరిగినప్పుడే శిల సాలగ్రామ మవుతుంది. సంఘర్షణలో నిలువ గలిగినప్పుడే ఒక సిద్ధాంతం సమాజ కల్యాణానికి దోహదం చేస్తూ తన అస్తిత్వాన్ని నిలుపుకో గలుగుతుంది. భగవంతుణ్ణి పత్ర పుష్ప ఫల తోయాలతో ఎందరో అర్చిస్తారు. అతణ్ణి నేను మానవ రూపంలో సేవిస్తున్నాను.

శరణుడే నా శివుడు.

ఈ మతం నాతో రాలేదు-నాతోనూ పోదు. ఏ రాజులూ న్యాయ స్థానాలూ విశ్వ ప్రేమను, మానవతను బంధించలేవు-ఇవి శాశ్వత సార్వకాలిక సత్యాలు."

మంచనభట్టారకుడు మౌనం వహించాడు.

బసవన్న మాటల చేత అతడు ప్రభావితుడైనాడు. బసవన్న చెపుతున్నది 'సత్యమే' నని అతనికి అనిపిస్తున్నది.

"విచారణ తిరిగి రేపటికి పొడిగించ బడింది" అని మంచెన భట్టారకుడు లేచాడు.

* * *

ఆ రాత్రి వైద్యశాలలో నారాయణాచార్యులవారు మరణించారు!

రాజ గురువు మరణించినందుకు ఏడు దినాలు సంతాప దినాలుగా ప్రకటించారు.

రాజ్యంలోని శైవేతరులంతా సమావేశాలు జరిపి నారాయణాచార్యుల వారి మరణానికి విచారం వెలిబుచ్చుతూ, లావణ్యవతీ-శీల

వంతుల వివాహాన్ని ఖండిస్తూ తీర్మానాలు చేశారు. కేశవపెద్ది పంచాగ్ని మధ్యంలో నిరాహార దీక్ష ప్రారంభించాడు. ఇదే సమయమని జైనులు దేశ వ్యాప్తంగా సమ్మె మొదలుపెట్టారు. రాజ్యంలో విప్లవ సూచనలు కన్పడేసరికి బిజ్జలుడు భయపడిపోయాడు.

అత్యవసరంగా వెళ్ళి న్యాయమూర్తి మంచెన భట్టారకుణ్ణి కలుసుకున్నాడు. చాలా పొద్దుపోయే వరకూ చర్చించాడు.

ఆ మరునాడు "బసవేశ్వరుడు వెంటనే బిజ్జలుని రాజ్యం వదిలి పోవలసిందిగా" బహిష్కరిస్తూ ప్రభుత్వపు ఉత్తరువు వెలువడింది॥

# 30

న్యాయస్థానంలో ఇంకా విచారణ సాగుతూనే వుంది. ఎందరో సైనికాధికారులూ, ప్రజలు క్రమంగా తమ తమ సాక్ష్యాలు ఇస్తూ వున్నారు.

"నీ పుత్రుని ఆత్మకు శాంతి కలుగజేస్తాను. ఆమరణ నిరాహార దీక్ష విరమించమని" బిజ్జలుడు స్వయంగా ప్రార్థించిన మీదట కేశవపెద్ది పంచాగ్ని మధ్యం నుండి లేచాడు.

"ఆ శీలవంతుని రక్తంతో ఈ కల్యాణీ నగర వీధులు తడవక పోతే నేను జుట్టు ముడి వేసుకోను" అని ఆండాళ్ పుత్ర శోకంతో బిజ్జలుని ఎదుటే ప్రతిజ్ఞ చేసింది.

అది విన్న వారికి మహాభారతంలోని ద్రౌపది గుర్తుకు వచ్చింది.

'దుశ్శాసనుని రక్తంతో తడిపినప్పుడే జడ ముడి వేసుకుంటా' నన్నది ద్రౌపది.

కాని మహా పుణ్యాత్ముడైన శీలవంతుడు దుశ్శాసనుడా?

'ద్రౌపదిని దుశ్శాసనుడు అవమానించినట్లు శీలవంతుడు ఆండాళ్‌ను ఎన్నడూ అవమానించలేదే!' ఆండాళ్ బంధువులు కూడా నివ్వెరపోయారు.

విజ్జలుడు పాలోచనగా తిరిగి వెళ్ళిపోయాడు.

అతని మనస్సులో బసవన్న మెదులుతున్నాడు.

* * *

బసవేశ్వరుడు గంగాంబికనూ బాల సంగయ్యనూ వెంటబెట్టు కొని కల్యాణ్ వదిలి వెళ్ళడానికి సిద్ధమైనాడు.

రాత్రికి రాత్రి లక్షల గృహాలు ఖాళీ చేసి ప్రజలు బసవేశ్వరుని వెంట బయలుదేరారు.

"మీరున్న చోటే మాకు రాజధాని-మీరే మా దైవం- మీరు లేని కల్యాణ్ ప్రాణం లేని శరీరం, దేవుడు లేని దేవాలయం" అన్నారు ప్రజలు. బసవన్న వారిని వారించాడు.

"మనం అంతా కల్యాణ్ వదిలిపోతే మన ప్రతిపక్షాలే విజయం పొందుతాయి. మన సిద్ధాంతం అప్పుడు పరాజయం పొందు తుంది. ధైర్యంగా ఎదురు నిలవండి. వారు చేయదలచినదేదో చేయ నివ్వండి.

తనువులు శాశ్వతాలు కావు-ధర్మం శాశ్వతం.

నిజంగా వారు మన రక్తాన్ని కల్యాణ్‌లో చిందించదలిస్తే ఆ రక్త పంకం నుండే భవిష్యత్తులో నవ సమాజ అరుణ కమలం వికసిస్తుంది.

ప్రభువును ధిక్కరించడం లేదని నిరూపించు కోవడం కోసమే నేను మిమ్మల్ని వదిలి వెళుతున్నాను. నేను ఎక్కడ శారీరకంగా వున్నా నా ఆత్మ మాత్రం ఇక్కడే మీ పాదాల వద్దే- కమలాల చుట్టూ తిరిగే షట్పది వలె తిరుగుతూ వుంటుంది.

ప్రస్తుతం నేను కూడలి సంగమేశ్వర క్షేత్రానికి వెళ్తున్నాను" అని చెప్పి ఎవ్వరినీ తన వెంట రానివ్వకుండా ఆపివేశాడు.

అక్కమహాదేవి మాత్రం "నాకిక కల్యాణ నగరంతో పని తీరిపోయింది. నేనిక నా భర్త శ్రీశైల మల్లికార్జునుని వద్దకు పోతున్నాను" అని శ్రీశైలం వెళ్ళిపోయింది.

మాయాదేవి శివరంజనిరాగం పాడింది.

మహాభక్తులు బసవన్నకు కన్నీళ్ళతో అర్ఘ్య పాద్యాదులు అర్పించారు. రెండూ వైపులా బారులు తీరి నిలుచున్న వారి చూపులు నల్ల కలువల తోరణాలవలె సుదీర్ఘంగా రెండు వైపులా బసవన్న మార్గాన్ని అలంకరించాయి. ఆ నల్ల కలువల రేకులన్నీ కన్నీటి బిందువులతో తడిసి మంచు బిందువులకు తడిసిన నీలోత్పలములై క్రమంగా ముడుచుకున్నాయి.

పాదచారియై బసవన్న కూడల సంగమేశ్వరుని గానం చేసుకుంటూ సాగిపోయాడు.

నీడవలె గంగాంబిక భర్త ననుసరించింది. అప్పుడామె మనస్సులో లావణ్యవతి మెదులుతున్నది.

* * *

ఆ సమయంలో లావణ్యవతి కారాగారంలో ఒంటరిగా కూర్చొని ఏదో ఆలోచిస్తున్నది.

"అమ్మాయిగారూ!" లకుమాయి పిలిచింది, కటకటాల బయటినుండి.

లావణ్యవతి తల పైకెత్తి చూచింది.

"లకుమాయీ!"

"మిమ్మల్ని చూడడానికి కారగృహ అధికారులు నాకు అనుమతి నిచ్చారు అమ్మాయిగారూ!" అని ఏడుస్తూ భక్ష్యాలు, మండెగలూ కటకటాల మధ్య నుండి లావణ్యవతికి అందివ్వబోయింది. చిరునవ్వుతో లావణ్య వాటిని తిరస్కరించింది.

"ఎందుకే కన్నీళ్ళు పిచ్చి పిల్లా!" అన్నది లావణ్య. లావణ్య కంఠస్వరంలో ఏట్టి విచారరేఖ కూడా లేదు. ఆమె మాటా, ముఖమూ, మనస్సూ అన్నీ నిర్మలంగా వున్నాయి.

"బసవన్నగారు కల్యాణ్ వదిలి సంగమేశ్వరం వెళ్ళిపోయారు. ప్రజలంతా పరితపిస్తున్నారమ్మా!"

"అలాగా! ఈ పరిణామం నాకు తెలియదే!" అన్నది లావణ్యవతి.

"మేము చేసినపనికి ఆయనకు శిక్ష!" అన్నదిలావణ్యవతి మళ్ళీ.

"బిజ్జలుడు అలా అనుకోవడం లేదమ్మా! ఆయన ప్రోద్బలం వల్లనే ఇంతటి సాహసకార్యం మీరు చేయగలిగారని అనుకుంటు న్నాడు."

"బసవ జ్యోతి లేకుంటే చీకటిలో గబ్బిలంవలె జీవితం సామాన్యంగా రాజభోగాలలో నశించిపోయి వుండేదే!

కాని నా కిప్పుడు మనశ్శాంతి లభించింది లకుమాయీ-నా జీవి తానికికూడా ఒక ప్రయోజనమున్నదన్న తృప్తి లభించింది."

లావణ్యవతి కన్నులవెంట ఆనందబాష్పాలు రాలాయి.

"లకుమాయీ! ఏదీ బసవన్నగారి ఆ గీతం చదువు- ఉత్తముడని...."

లకుమాయి గీతం రాగం లేకుండా పొడిపొడిగా వెక్కి-వెక్కి- ఏడుస్తూ పాడింది-

"ఉత్తముడని పేరొందిన బ్రతుకది
మొత్తమైదు నాళ్ళైనను చాలును
ఐదుకాదు నాలుగు నాళ్ళైనను
మూడునాళ్ళు రెండైనను చాలును
శివభక్తానాం జీవితం వరం పంచదినానిచ
న భక్తిహీనం కల్ప సహస్రంతు శాంకరీయను
ఘనవచనమువలె సంగమ శరణులు
వీడు మంచివాడనినను చాలును

వాని జీవితమ్మొక దినమైనను...." అని లకుమాయి మళ్ళీ ఏడ్చింది.

"ఛీ! ఏమిటే ఈ కన్నీళ్ళు? శివానుభవమంటపంలో చేరిన తర్వాత కష్టాలకు కన్నీళ్ళు పెట్టడం పాపంకాదా. లకుమాయీ! ఈ కారాగారంకూడా శివారాధనలో ఒక భాగమే. లకుమా! యజ్ఞమంటే నిప్పులో నేయిపోయడం, మేకను చంపడంకాదు. చేసే ప్రతిపనీ యజ్ఞమే: న్యాయమూర్తి ముందు నిలబడటం-ఇలా చెరసాలలో

మగ్గడం-రేపు ఏదైనా శిక్షపడితే చిరునవ్వుతో అనుభవించడం- దాని పేరు లకుమాయీ యజ్ఞమంటే!

ఇదీ బసవన్నగారి దివ్యసంస్కార ఫలం మనకు" అన్నది లావణ్యవతి.

అంతఃపురంలోని హరిణకన్య కాదు లావణ్యవతి.

అడుగుల చప్పుడుకు బెదిరి పారిపోయే కుందేటి కూనకాదు నేడీమె!

ఆగత-అనాగతాలను ధైర్యంగా ఎదుర్కొనేందుకు మానసికంగా సిద్ధమైన పింగపు కొదమ.

'ఇంత లేత శరీరంలో ఎంత బలమైన మనస్సు బసవన్నా! ఇదంతా నీవు చేసిన మాయ సుమా!' అనుకున్నది లకుమాయి.

"ఆ! సమయం మించి పోయింది. ఇకపద." అధికారులు లకుమను కారాగృహం నుండి బయటకు నడువమంటున్నారు.

తాను తెచ్చిన మధురపదార్థాలను తిరిగి తన బుట్టలోనే పెట్టుకొని కన్నీళ్ళతో వెనుదిరిగింది లకుమ.

అప్పుడు లావణ్యవతి శీలవంతుణ్ణి గూర్చి ఆలోచిస్తున్నది.

* * * *

ఆ సమయంలో శీలవంతుడు కలకేత బ్రహ్మయ్యతో ఛలోక్తులాడుతున్నాడు.

బ్రహ్మయ్య ఇంద్రజాల విద్యలో చిత్రవిచిత్ర రూప ప్రదర్శనలు చేసి చూపుతున్నాడు.

నవ్వుకున్నంత సేపు నవ్వుకున్నారు.

ఉన్నట్టుండి కలకేత బ్రహ్మయ్య ఒక్కసారి ఏడ్చాడు.

"బ్రహ్మయ్యా!" అన్నాడు శీలవంతుడు.

"శీలవంతయ్యా! ఎంత కష్టం వచ్చింది మనకు? ఏడ్వలేక నవ్వుతున్నాను కాని నిజంగా నీ వంటి ఉత్తమునికా ఈ శిక్ష? చాళుక్యుల కుట్రను భగ్నం చేసి ప్రభుత్వానికి తెలియపరచాలన్న సంకల్పంతో రాత్రింబవళ్ళు శ్రమిస్తే చివరకు భైరవుని కోనలోని పిశాచాలం మనమేనంటాడా ఈ బిజ్జలుడు? వీడికి పోయేకాలం వచ్చింది."

"బ్రహ్మయ్యా! కోపంలో కూడా మనం శత్రునిందచేయ కూడదు. అప్పుడే బసవన్నగారికి నిజమయిన శిష్యులమనిపించు కుంటాం! ఇన్నాళ్ళూ మనం నేర్చుకున్న పాఠాలు ఇవే!

నిజంగా బిజ్జలుడు మనకు దైవం పంపిన ప్రతినిధి!
లేకుంటే మనకీ పరీక్ష ఎలా లభిస్తుంది?
మన బంగారం మంచిదో చెడ్డదో ఎలా నిర్ణయింపబడుతుంది?"

"శీలవంతయ్యా: నాకెందుకో భయంగా వుంది?"

"అభయం బసవన్నగారి మతం. ప్రాణానికి భయపడటమా బ్రహ్మయ్యా?"

"నా గూర్చి నాకు భయంలేదు- నీగూర్చే. అందులోనూ ఈ ఆదర్శ వివాహం మరీ పెద్ద నేరం వారి దృష్టిలో. ఫలితం ఎలా వుంటుందో ఏమో!...."

"ఎలా వుంటేనేం- భయపడతామా? బసవన్నగారు ఏమన్నారు-

'రేపటి ఫలితము నేడే రానీ
ఈ దిన ఫలితమ్మిపుడే రానీ
'జాతస్యధ్రువం మరణమ్మ'నుచును___
బెదురు చెందులకు భయపడుటెందుకు
సంగమ లిఖితము స్వీకరింపవలే'...."

అని శీలవంతుడు నవ్వాడు.

శీలవంతుని మనస్సులో అకస్మాత్తుగా మధువరసు మెదిలాడు. మంత్రి పదవిలో వున్న మహాపురుషుడు చెరసాల పాలైనాడే అన్న చింత శీలవంతునికి కలిగిందొక్క క్షణం.

* * * *

సరిగ్గా అప్పుడు మధువరసు ధ్యానం చేస్తూ వున్నాడు. ధ్యానం ముగించి కారాగృహ అధికారులిచ్చిన ఆహారం స్వీకరిస్తున్నాడు.

ఇంతలో ఒక రక్షకభటుడు వచ్చి-

"మిమ్మల్ని చూచేందుకు విజయరామప్ప వస్తున్నారు" అన్నాడు.

"మంచిది-రమ్మను" అన్నాడు మధువరసు.

విజయ రామప్ప వచ్చాడు.

మధువరసుకు నమస్కరించాడు.

మధువరసు చిరునవ్వుతో ప్రతి నమస్కారం చేశాడు.

"బాబూ! మిమ్మల్నీ దశలో చూడవలసి వస్తుందనుకోలేదు" అన్నాడు విజయరామప్ప.

విజయరామప్ప కల్యాణ్‌లోని కోటీశ్వరుడు. అవసరమైనప్పుడు బిజ్జలునికి కూడా అప్పు పెట్టే ధనవంతుడు.

"చీకటీ, వెలుగూ- రెండూ జీవితానికి సహజమే! అయితే ఈ కారాగారం నేను కష్టంగా భావించడం లేదు విజయరామప్పా! నేనే పాపమూ చేయలేదు- అలాంటప్పుడు నా మనస్సుకు పరితాపం ఎందుకు?" అన్నాడు మధువరసు.

విజయరామప్ప మధువరసును దగ్గరకు పిలిచాడు.

"వింటున్నారా?"

"ఏమిటి?"

"నేనంతా సిద్ధం చేశాను....

"ఏమిటి?"

"అదే- మీరూ, లావణ్యవతీ చెరసాల నుండి బయట పడడానికి అన్ని ఏర్పాట్లూ చేశాను. మంత్రిగా మీరు నాకు చేసిన సహాయానికి ఈ చిన్న ఉపకారం చేసి నా ఋణం తీర్చుకుందామని ఆశ-

రక్షకభటులకు కొన్ని కోట్లు ఇస్తున్నాను. మీ కోసం కోట తూర్పు ద్వారం వద్ద అశ్వాలు పూనిన వాహనం సిద్ధంగా వుంటుంది- సరిగ్గా తెల్లవారు జామున అక్కడి నుండి మిమ్మల్ని వారు ఆంధ్ర సామ్రాజ్యానికి చేరుస్తారు-"

"హరహరా! ఎంత అపచారం విజయరామప్పా!" అన్నాడు మధువరసు బాధగా—

"ఇన్నాళ్ళూ అనుభవ మంటపంలో బసవన్న పాద సేవ చేసి నేను నీతిని నేర్చుకున్నది, ఇలా చివరకు పారిపోవడానికా విజయ రామప్పా?

ఈ అనంత విశ్వమూ ఈశ్వర సామ్రాజ్యమే! ఈ చెరసాల, ఈ కటకటాలు. కల్యాణ నగరం ఆ సుదూర ప్రాంతాలలోని ఆంధ్ర సామ్రాజ్యం-అంతా ఈశ్వరమయమే విజయరామప్పా! నేను ఎక్కడి నుండి తప్పించుకొని ఎక్కడికి పారిపోగలను?

శివుని వద్ద నుండి తప్పించుకొని మళ్ళీ శివుని వద్దకే పోవాలి-అంతేనా?

విజయరామప్పా! ఒకవేళ నేను తప్పు చేశానని బిజ్జలుడు నిర్ణయించి శిక్ష ఇచ్చినా ఆ శిక్ష నా శరీరానికే గాని మనస్సుకు కాదుగా! ఆత్మకు అంతకంటే కాదుగా!

జరామరణాలు లేని ఆత్మను బిజ్జలుడేమి చేయగలడు విజయ రామప్పా!

మన మాటలు శివుడు వింటున్నాడు. మన పనులు శివుడు చూస్తున్నాడు.

దొంగవలె చీకటిలో పారిపోవడం వల్ల నేను చేయని నేరాన్ని చేసినట్లు నిరూపించుకొన్నట్లవుతుంది విజయరామప్పా!

నేను మంత్రిగా వుండగా ఎందరికో ఎన్నో సహాయాలు చేశాను. అవన్నీ ప్రతి ఫలాలు ఆశించి చేసినవి కావు! అలాగే నీకూ సహాయం జరిగి వుండవచ్చు. నీ కృతజ్ఞతకు నా ధన్యవాదాలు.

అయితే నిజంగా నా మీద నీకు ప్రేమే వుంటే ఇలాంటి పని మాత్రం చేయకు!

నేనీ పని చేశానని అనుభవ మంటప సభ్యులకు తెలిస్తే నా బ్రతుకు కిక నిష్కృతి ఉండదు విజయరామప్పా!

లోకాన్ని మనం మోసగించగలం కాని, మన ఆత్మను మనం మోసం చేసుకోగలమా విజయరామప్పా!"

విజయరామప్ప మారు మాట్లాడలేక పోయాడు. "శలవు తీసు కొంటాను" అని మెల్లగా వెళ్ళిపోయాడు. గుండెలపై బరువు దిగి పోయినట్లు తృప్తిగా నిట్టూర్చాడు మధువరసు!

# 31

దాదాపు పదివారాలకు పైగా న్యాయవిచారణ సాగింది. చివరకు మంచెన భట్టారకుడు ఒకనాడు తీర్పు ఇలా ప్రకటించాడు-

"కృష్ణపెద్దిని-శీలవంతుడూ, కలకేత బ్రహ్మయ్యా హత్య చేశారన్న ఆరోపణం సాక్ష్యానికి నిలవడం లేదు. అంతేకాక భైరవుని కోనలో ఉన్న పిశాచాలు చాళుక్య రాజుల సైనికులే అన్న అంశం సాక్ష్యాలతో నిరూపింప బడింది. చాళుక్య సైనికులే శీలవంత, బ్రహ్మయ్య, కృష్ణపెద్దిలపై విష బాణాలు ప్రయోగించారని మేము నమ్ముతున్నాము. విజయదశమి నాటి విష బాణ ప్రయోగమూ, అంతః పురంలోని విష ప్రయోగమూ కూడా చాళుక్యుల గూఢచారులు చేసిన వేననీ అందులో కృష్ణపెద్ది జోక్యం కూడా ఉందనీ మాకు విశ్వాసం కలిగింది. కాబట్టి ఈ హత్యారోపణలో నిర్దోషులుగా శీలవంతుణ్ణీ, కల కేత బ్రహ్మయ్యనూ నిర్ణయిస్తున్నాము."

కిటకిటలాడి పోతున్న న్యాయస్థానంలో కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి.

"సద్దు-సద్దు." రక్షక భటులు జోక్యం చేసుకున్నారు.

"ఇక లావణ్యవతీ శీలవంతుల వివాహ నేరం!! చాళుక్య ప్రభువులూ, కాలచూరి ప్రభువులూ- వర్ణాశ్రమ ధర్మ పాలకులు. ఏ ధర్మాన్ని రాజు తన రాజ్యంలో నిర్ణయిస్తాడో ఆ ధర్మాన్నే ప్రజలు అనుసరింపవలసి వుంటుంది.

దాని మంచి చెడులను నిర్ణయించే అధికారం వారికి వుండదు.

అనుభవ మంటపంలో పుట్టిన సంస్కరణాత్మక మతాన్ని ఈ రాజ్యమూ, ఈ చట్టమూ గుర్తించడంలేదు. ఆ కారణంచేత దాని మంచిచెడ్డలూ వాద ప్రతివాదాలు మన రాజ్యాంగమునకు బొత్తిగా సంబంధం లేని అంశాలే అవుతాయి.

కాలచూరి రాజుల పాలనలో వుంటూ కాలచూరి రాజులు చేసిన చట్టాలను అనుసరించే ధర్మాలను ఉల్లఘించడం ఈ రాజ్యపు పరిధిలో నేరమే అవుతుంది. కాబట్టి ఈ నేరాన్ని చేసిన లావణ్యవతీ శీలవంతులకు-వారిని ప్రోత్సహించి ఆమోదించిన వారి జననీ జనకులు హరళయ్య, కల్యాణమ్మ, మధువరసులకు కాలచూరి-రాజ్యాంగంలోని శిక్షాస్మృతి పదవ ప్రకరణంలోని అయిదవ అధికరణం ప్రకారణం కఠిన మరణ శిక్షను-విధిస్తున్నాము."

సభలో ఆర్తనాదాలు ఒక్కసారిగా మిన్ను ముట్టాయి. మంచన భట్టారకుడు మరుక్షణమే సభాభవనం నుండి నిష్క్రమించాడు.

న్యాయస్థాన భటులు గంటలు మోగించి 'వెళ్ళండి- ఇక వెళ్ళండి' అని ప్రజలను న్యాయస్థానంనుండి బయటకు పంపేదుకు విశ్వ ప్రయత్నం చేస్తున్నారు.

న్యాయస్థానం బయట రోదిస్తున్న వేలాది ప్రజలను చెన్న బసవన్న, శివనాగుమయ్య, అల్లమ ప్రభుదేవర, అక్కనాగమ్మ, మేదర చెన్నయ్య, దోహరకక్కయ్య, ఘడేలు మాచయ్య, ప్రభృతి నాయకులు ఓదార్చడానికి ప్రయత్నిస్తున్నారు.

"ఇది శివ పరీక్ష! విచారించవలసిన సమయం కాదు. ధైర్యం వహించండి. సంగమేశ్వర నామస్మరణ చేయండి" అని ఉపదేశిస్తున్నారు. కాని జన సమూహాన్ని స్వాధీనంలో పెట్టడం వారికీ కష్టసాధ్యమవుతున్నది.

ఆ మరునాడు బిజ్జలుడు రాజ్యంలో సైనిక శాసనం ప్రకటించి ప్రధానమంత్రి పదవిని సేనాధిపతికి అప్పగించాడు.

"రాజశాసనాన్ని ధిక్కరిస్తూ ఎవరు సంతాపం ప్రకటించినా, నిరసన వాక్యాలు పలికినా వారి తలలు గండ్రగొడ్డళ్ళతో నరికించబడతాయి" అని సర్వ సైన్యాధిపతి మహాశాసనాన్ని ప్రకటించాడు.

చైత్ర శుద్ధ దశమినాడు మరణ శిక్షకు ముహూర్తం నిర్ణయింపబడింది.

ఆనాడు లావణ్యవతీ శీలవంతులు ఇష్ట పదార్థాలు భుజించవచ్చుననీ ఇష్టమైన వస్త్రభూషణాదులు ధరించవచ్చుననీ అధికారులు అనుమతించారు.

కలకేతబ్రహ్మయ్య, శీలవంతుణ్ణి పెళ్ళి కొడుకువలె అలంకరించాడు.

లకుమాయి, లావణ్యవతిని సర్వాభరణ భూషితను చేసింది.

లావణ్యవతికి తిలకం దిద్దుతూ కన్నీరు కార్చింది లకుమాయి.

ఆ కన్నీటి బిందువులకు తిలకం కరిగి చెక్కిళ్ళ మీదినుండి జారిపోయింది.

మళ్ళీ తిలకం దిద్దింది లకుమాయి.

లావణ్య లకుమను బిగియారా కౌగలించుకొంది. ఇద్దరూ పెద్దగా ఒక్కసారి రోదించారు.

మరుక్షణమే లావణ్యవతి నవ్వి "మానవ దౌర్బల్యమిది! దుఃఖమేమిటి మనకు లకుమాయీ? వసంత నవరాత్రాలకిది ముగింపు" అన్నది.

శీలవంతుడు, కలకేతబ్రహ్మయ్య కౌగిలిని వీడాడు.

లావణ్యవతీ, శీలవంతులు ఒకరి పక్కన ఒకరు నిలుచున్నారు.

సంకెళ్ళతో వున్న చేతులనే ఒకరినొకరు పట్టుకొని నడిచారు.

మావటీవాడు నీలమేఘమనే పెద్ద ఏనుగును తెచ్చాడు. దానిని బాగా తాగించారు.

మత్తెక్కిన ఏనుగు భూమ్యాకాశాలు గర్జించేటట్లు ఘీంకారం చేసింది. ఆ ధ్వనికి ఆకాశం ప్రతి ధ్వనించింది.

ఐరావతం స్వర్గంలో ఉలిక్కిపడింది. కుమ్మరి వాడు వచ్చాడు.

కొలిమితిత్తి సలసలమండించాడు. మంటలలో రెండు ఇనుప కొర్రులను ఎర్రగా కాల్చారు.

కణకణమండే ఇనుప కొర్రులతో హరళయ్య, కల్యాణమ్మ, మధువయ్య కళ్ళు పొడిచారు.

రక్తం చిమ్మింది.

ఆకాశంలో ఎర్రని సూర్యుడు చిద్రుపలు చిద్రుపలుగా పగిలి పోధిపై భూమిపై రాలినట్లనిపించింది.

"అమ్మా" అనలేదు "అబ్బా" అనలేదు. బాధామయ రేఖలే వారి ముఖంలో గోచరించలేదు.

"సంగమేశ్వరా!" అని మాత్రం అన్నాడు ముగ్గురూ.

ఆ తరువాత వారిని ఇనుప గొలుసులతో బంధించారు. ఆ గొలుసులను నీలమేఘ గజానికి వెనుక కాళ్ళకు కట్టారు.

ముందు రెండు కాళ్ళకూ ఒక వైపున శీలవంతుణ్ణీ, రెండవ వైపున లావణ్యవతినీ గొలుసులతో బంధించారు.

మావటీవాడు ఏనుగు పైకెక్కి అంకుశంతో కుంభస్థలంపై చావుపోటు పొడిచాడు. తాగి మత్తెక్కిన ఏనుగు పిచ్చిపట్టినట్లుగా అరిచి కల్యాణ నగర రాజవీధులలో పరుగెత్తింది.

ఆ వేగానికి దాని కాళ్ళకు కట్టివేయబడ్డ ఐదుగురి తలలూ పగిలి రక్తం ధారలుగా కారింది.

కల్యాణ నగర రాజవీధులు నెత్తుటిలో స్నానం చేశాయి.

భూమి మొత్తం ఎర్రని లావాతో తడిసినట్లయింది!

ఏనుగు ఘీంకరిస్తూ పరుగెత్తుతున్నది. దాని కాళ్ళకు బంధింపబడిన వ్యక్తుల శరీరాలు ఎక్కడికక్కడ విరిగిపోతున్నాయి.

గమన వేగంలో ఏనుగు ఒక కాలును శీలవంతుని తలమీద మరో పాదాన్ని లావణ్యవతి తలమీద పెట్టింది.

ఎర్ర గుమ్మడి పండ్లవలె వారి తలలు ముద్దలు ముద్దలయి నేలకు కరుచుకొని పోయాయి.

ఏనుగు ఇంకా పరుగెత్తుతున్నది.

తాను పిచ్చెక్కించిన ఏనుగును తానే స్వాధీనం చేసుకోలేకపోతున్నాడు మావటీవాడు. ప్రాణభయంతో మావటీవాడు దారిలో కొంచెం కింది వరుసగా అంది వచ్చిన ఒక చెట్టు కొమ్మను ఎగిరి పట్టుకొని వణకసాగాడు.

కాలచూరి రాజుల ఉన్మత్త దంతావళం పీలమేఘం అదుపు ఆజ్ఞలు లేకుండా పరుగెత్తి పోతున్నది. ఆ వేగానికి ఇనుప గొలుసులు తెగిపోయాయి.

ఐదు శవాలు ఐదు దిక్కులకు ముక్కలు ముక్కలుగా చెదిరి పడిపోయాయి.

కల్యాణ నగరంలోని హాహాకారాలు కైలాసాన్ని జ్వాలల్లాగా అందుకున్నాయి.

"బసవన్న ఆన! శాంతి-శాంతి!" అంటూ అల్లమ ప్రభువూ, శివనాగుమయ్యా, లక్షలాది శివశరణులను ఓదారుస్తున్నారు. మంత్ర రుద్ధ భుజంగాలు తలలు వంచుకున్నాయి.

# 32

చైత్ర బహుళ చతుర్దశి!!

బిజ్జలుని అంతఃపురం!

నగరమంతా సైనికులు నిర్విరామంగా గస్తీ తిరుగుతున్నారు.

కొంచెం చీకటి పడితే నగర వీధులలో జనసంచారం ఆగిపోతున్నది.

రాత్రిళ్ళు కల్యాణ్ వీధుల్లో యముడు నల్లని మహిషాకృతి దాల్చి తిరుగుతున్నాడనే పుకారు జనులలో వ్యాపించింది. అర్ధరాత్రి వేళ ఐదు తలలేని మొండెములు రాజ వీధులలో నడుస్తున్నాయట!

నక్కలు ఊళలు పెడుతున్నాయి నగరమధ్యంలోనే-

దేగలు వాగులలో మూగుతున్నాయి-

నాగులు పడగలెత్తి మోగుతున్నాయి-

ఈ వార్తలన్నీ బిజ్జలుడు కూడా విన్నాడు.

ఇందలి సత్యా సత్యాలను విచారించిన వాడు తక్కువ.

బిజ్జలునికి నిద్ర పట్టలేదు-

పక్కపై అటూ ఇటూ దొర్లుతున్నాడు.

కళ్ళు తెరిచినా కళ్ళు మూసినా బసవేశ్వరుడే కనిపిస్తున్నాడు-

"భ్రాంతి—మిధ్య—అసత్యం" అనుకున్నాడు తనలోనే తాను.

బిజ్జలుడేదో తీవ్రమైన అశాంతి ననుభవిస్తున్నాడు.

"నే నిదంతా కాలచూరి సామ్రాజ్య క్షేమంకోసమే చేశాను" అని తన సంతృప్తికోసం తానే అనుకున్నాడు పైకి.

"కాదు- స్వార్థంతో చేశావు. నీ రాజ్య పదవి కోసం చేశావు" అన్నది ఆత్మ.

"అబద్ధం" అని అరిచాడు.

తన మనసూ, తన ఆత్మా తనకు శత్రువులైనాయి.

"శత్రువులు వెలుపల లేరు, లోపలే ఉన్నారు" అనుకున్నాడు బిజ్జలుడు.

అర్ధరాత్రి దాటింది.

సన్నగా కునుకు పట్టింది.

అందులో స్వప్నం-

కైలాసంలో శివుడు తన వంక క్రోధ దృష్టితో చూస్తున్నాడు. "అలా చూడవద్దు ప్రభూ! బిజ్జలుడు నిమిత్తమాత్రుడు. ఆయనవల్లనే మా త్యాగ పూర్ణమైన చరిత్రను లోకానికి తెలిపే అవకాశం కలిగింది" అంటున్నారు లావణ్యవతీ శీలవంతులూ, మధువరసు, హరళయ్యా, కల్యాణమ్మలు. అంతా ప్రమధులై శివసామీప్యంలో కూర్చున్నారు. ఒక్క బసవన్న మాత్రం శివసారూప్యంలో కూర్చున్నాడు.

"బిజ్జలా! భూమిపై నీ పాత్ర ఇక ముగిసింది- ఆలస్య మెందుకు-.రావయ్యా!" పిలుస్తున్నాడు మధువరసు....

బిజ్జలునికి మెలకువ వచ్చింది-

లేచి చూచాడు.

ఇంకా తెల్లవారుజాము కాలేదు.

శరీరమంతా చెమటలు పట్టింది.

గుండె వేగంగా కొట్టుకుంటున్నది.

తనకు వచ్చిన కలకు తానే విభ్రాంతుడైనాడు.

పానపాత్రతో కొద్దిగా మంచి తీర్థం పుచ్చుకున్నాడు.

'ఇదంతా ప్రయత్న పూర్వకంగా నేను చేయలేదు- నా చేత ఏదో అంతులేని ఒక మహాశక్తి చేయించింది' అనుకున్నాడు తనకు వినబడేటట్లే తాను. బిజ్జలుడు పడుకున్న అంతఃపురం పక్కనే పూదోట వుంది. అందులో ఎత్తైన ఫలవృక్షాలూ పుష్పవృక్షాలు ఉన్నాయి. అందులో ఒక చెట్టుమీదుగా మూడు పిశాచాలు పైకెక్కి అక్కడి లతలను పట్టుకొని పైకి పాకాయి. మూడూ అంతఃపురంలోని విశాల భవన ప్రాంగణంలో దిగాయి.

ఇంతలో ఒక సైనికుడు గస్తీ తిరుగుతూ అటు వచ్చాడు.

ఒక పిశాచం సైనికుణ్ణి వెనుకనుండే నోరు మూసింది- మెడ నొక్కింది.

గస్తీ సైనికుడు చడీ, చప్పుడూ లేకుండా కిందపడిపోయాడు.

మూడు పిశాచాలూ కొంచెం ముందుకు పోయాయి.

మరి నలుగురు గస్తీసైనికులు తిరుగుతూ వున్నారు.

పిశాచాలు కొంచెం నక్కాయి.

గస్తీ సైనికులు అవతలి ద్వారం వైపు పోగానే, పిశాచాలు మళ్ళీ కొంత భవనం లోపలికి చొచ్చుకొని పోయాయి.

అక్కడ ప్రధాన ద్వారం వుంది.

ద్వార రక్షణాధికారి కునుకుతూ కూర్చుని వున్నాడు.

అతడు బాగా ముసలి వాడు.

అతడు తైలపుని తండ్రి కాలంనుండీ అక్కడ పనిచేస్తూ వున్నాడు.

తైలపుని అంతఃపురానికీ ఇలాగే రక్షణాధికారిగా ఉన్నాడు.

గత ఆరేండ్లుగా బిజ్జలునికీ ఇలాగే రక్షణాధికారిగా వున్నాడు.

అతడు ముసలి వాడయినా మహా ఘటికుడు.

అతడివి పాము చెవులు.

ఎవరో కొత్త వ్యక్తులు లోనికి ప్రవేశించి నక్కుతున్నారని పసికట్టాడు.

లేచి కత్తిని కవచాన్ని సర్దుకొన్నాడు. ఇంతలోనే ఒక పిశాచం రివ్వున వచ్చి ముసలివాడి పైకి దూకి నోరు మూసింది. పిశాచం తన ముసుగు తీసింది.

"మీరా బాబూ!" అన్నాడు ముసలివాడు.

"అవును నేనే- తలుపు తియ్యి."

ముసలివాడు మారుమాట్లాడకుండా సింహ ద్వారం తెరిచాడు.

"బాబూ! చిన్న సందేహం...."

ముసలివాడు ఏదో అడగబోయాడు.

"ఉష్!" మాట్లాడవద్దని పిశాచరూపుడు చేతితోనే ముసలివాణ్ణి వారించాడు. ఇంతలో మరి రెండు పిశాచాలు పక్కనుండి వచ్చాయి.

"వాళ్ళను కూడా వదులు!" మొదటి పిశాచం ఆజ్ఞాపించింది.

"చిత్తం."

మూడు పిశాచాలూ ప్రధాన భవన అంతర్భాగానికి నిరాటంకంగా నిర్భయంగా ప్రవేశించాయి.

"ఇంత త్వరగా లోనికి రాగలుగుతామనుకోలేదు." ఒక పిశాచం అన్నది.

"ఎంతైనా ముసలివాడు స్వామి భక్తిపరాయణుడు. అరవై ఏళ్ళుగా మన ఉప్పు పులుసు తిని బతికినవాడు ఆరేళ్ళల్లో మారి పోతాడా?"

ఎవరో గస్తీ తిరుగుతున్న శబ్దం. పిశాచాలు మళ్ళీ నక్కాయి. మెల్లగా నేలపై పాకుకొంటూ బిజ్జలుని పడక గదిని సమీపించాయి.

అక్కడ ఒక అడవి కుక్క కట్టివేయబడి వుంది. అది కొత్త వ్యక్తులను వాసన బట్టింది.

వెంటనే ఒక పిశాచం కుక్కకొక మాంసపు ముక్కను విసిరింది. కుక్క దానిని నాకింది. నాకుతూనే ప్రాణాలు విడిచింది.

ఇప్పుడు పిశాచాలు తమ తమ ముసుగులు తీసివేశాయి. తలుపులు తీసుకొని లోనికి వెళ్ళాయి. బిజ్జలుడు నిద్రపట్టక అటూ ఇటూ దొర్లుతున్నాడు.

"ఇంకా నిద్రపోలేదా బిజ్జలా!" ఒక పిశాచం అడిగింది. బిజ్జడు తల పైకెత్తి చూచాడు. ఎదురుగా మూడు మూర్తులు నిలబడి న్నాయి.

ఒకటి-శాంతార సేనాధిపతి జగదేవ దండనాయకుడు, రెండు-చాళుక్య రాజ్య ప్రతిష్ఠాపక బిరుదాంకితుడు తైలపుని సర్వ సేనానాయకుడు కుమార బ్రహ్మయ్య, మూడు-తైలపుని ఆంతరంగిక కార్యదర్శి మల్లిదేవుడు.

"ఇది కలా-నిజమా?" బిజ్జలుడు వణికిపోతున్నాడు.

"కలకాదు-ఇలయే" అన్నాడు జగదేవుడు.

"మీరిక్కడికి ఎందుకొచ్చారు?" అలా ప్రశ్నిస్తూనే కత్తి నందుకోబోయాడు బిజ్జలుడు.

మెరుపులాగా జగదేవుడు దూకి బిజ్జలుని కత్తిని స్వాధీన పరచుకొన్నాడు.

"ఎందుకు వచ్చామంటే ఏం చెప్పను?

నీవు చేసిన పాపాలనన్నిటినీ గుర్తు చేయడానికి వచ్చాను.

తైలప్రభువును కాకతీయులమీదికి యుద్ధానికి ప్రోత్సహించి వారిని కాందీశీకులను చేసి, కాకతీయుల చేతిలో ఓడిపోయేటట్లు చేసి రాజ్యం ఆక్రమించుకోవడం నీవు చేసిన మొదటి పాపం.

దైవస్వరూపుడూ, నీకు నమ్మినబంటూ అయిన బసవన్నను అవిశ్వాసంతో కల్యాణనగరపు పొలిమేరలనుండీ బహిష్కరించడం నీవు చేసిన రెండవ పాపం. అమాయకులైన అయిదుగురు మహా భక్తుల రక్తంతో కల్యాణనగర వీధులు తడపడం నీవు చేసిన మూడవ పాపం.

ఈ పాపాలకు ప్రాయశ్చిత్తం అవసరం కదా! అందుకే వచ్చాము" అన్నాడు జగదేవుడు.

"జగదేవా! తైలపుడు సజీవుడేనా?"

వికృతంగా నవ్వాడు జగదేవుడు.

"లేదు. ఇటీవలే అనారోగ్యంతో అస్తమించాడు. అయితే మా రాజభక్తి అకళంకమైనది. తైలపుని కొడుకు సోమేశ్వరునికి చాళుక్య సింహాసనం పట్టం కట్టడం మా అభిమతం.

ఇంతకాలం బసవన్నగారి ఆధ్యాత్మిక శక్తి వల్ల మేమీ అంతః పురాన్ని స్పృశించలేకపోయాము. లేకుంటే నిన్ను యమపురి కంపడ మాకొక లెక్కా?"

"అయితే నన్నిప్పుడు...."

ఇలా అంటూనే జగదేవ దండనాయకుడు బాకుతో బిజ్జలుని వీపుమీద పొడిచాడు.

బిజ్జలుడు అరవకుండా మల్లిదేవుడు, ప్రభువు నోరు మూసి చేతులు పట్టుకున్నాడు. బిజ్జలుడు గిల గిలా కొట్టుకొంటున్నాడు.

"అక్రమంగా నా శాంతార ప్రాంతాన్ని కాజేసి నన్ను అధర్మ యుద్ధంలో ఆనాడు పరాజితుడిని చేసినందుకు-నా కసి తీరిపోయింది" అన్నాడు జగదేవుడు.

"బిజ్జలా! ఇన్నేళ్ళుగా కాకతీయ రాజ్యంలో బందీలం అయి నామని పుకారు పుట్టించి, ఎక్కడ దొరికితే నీవు చంపుతావోనని భయంతో అడవుల్లో జంతువులకన్నా హీనంగా పాములతో పుట్ట లతోకలిసి మేమూ, చాళుక్య ప్రభువులూ బ్రతికింది ఇదిగో, ఈ శుభ ముహూర్తం కోసమే" అంటూ కుమారబ్రహ్మయ్య బిజ్జలుని డొక్కల్లో కత్తితో మరో పోటు పొడిచాడు.

చాళుక్య సేనాని పిడిబాకు చివరి వైఢూర్యం ధగ ధగ మెరిసి మెరుపులా మళ్ళీ కనుమరుగు అయింది.

బిజ్జలుని తలను కరకరా తరిగాడు మల్లిదేవుడు. హంస తూలికాతల్పం రక్తసిక్తమైంది.

"పదండి రాయమురారి పడక గదికి." జగదేవుడు పిలిచాడు.

ముగ్గురూ బిజ్జలుని గది దాటి బయటకు వచ్చారు. ఈలోగా గస్తీ తిరుగుతున్న సైనికుడొకడు చచ్చిన కుక్కను చూచాడు.

మాంసపు ముక్కను పరిశీలించి విష ప్రయోగం జరిగిందని గ్రహించాడు.

మరుక్షణమే వెళ్ళి జాగృత ఘంటికలను గణగణా మోగిం చాడు.

ఒక సైనిక పటాలం క్షణాలమీద బిజ్జలుని గది వద్దకు వచ్చింది.

బిజ్జలుని గది తలుపులు మూసే వున్నాయి. కాని ఒక సైనికు నికి ఏదో అనుమానం వచ్చి ఉడుములాగా పాకుకుంటూ పైకెక్కి-గవాక్షం నుండి తొంగి చూచాడు.

బిజ్జలుని మొండెం పాన్పుపై రక్తపు మడుగులో పడి వుంది.

కెవ్వున కేక వేసి కిందికి దూకాడు.

"అంతా అయిపోయింది. బిజ్జలుణ్ణి-హత్య...." అని పెద్దగా అరిచాడు సైనికుడు.

కొందరు సైనికులు రాయమురారి పడక గదిని చేరారు.

జగదేవుడూ, మల్లిదేవుడూ,కుమారబ్రహ్మయ్యా-రాయమురారి గదికి పోవడానికి ఇక సాహసించలేదు.

"ఏం చేద్దాం?" అని అడిగాడు కుమార బ్రహ్మయ్య.

"అంతా జాగృతులైనారు. ఇక కోట దాటడమే మంచిది. మనం ముగ్గురం. వారు వేల సంఖ్యలో ఉన్నారు" అన్నాడు జగదేవుడు.

"అయితేనేం? మన పరాక్రమం...." మల్లిదేవుడు ఏదో అనబోయాడు.

"ఇది దుస్సాహసం!" ఇలా అంటుండగానే ఒక ఖడ్గం వచ్చి జగదేవునికి తగిలింది. వెంటనే ముగ్గురూ పిచాళపు ముసుగులు తగిలించుకున్నారు.

జగదేవుడు కత్తి దెబ్బతో గిలగిల లాడాడు. కుమార బ్రహ్మయ్య, మల్లిదేవుడూ జగదేవుణ్ణి సాయం పట్టి నడిపించారు.

"పరిస్థితి విషమించింది. పెద్దగా అరవండి" అన్నాడు జగదేవుడు.

"బసవేశ్వరునికీ-జై" అని అరిచారు ఇద్దరూ.

"మళ్ళీ అరవండి."

"అనుభవ మంటపం వర్ధిల్లాలి."

"మళ్ళీ...."

"శివ శరణులకూ-జై."

"ఇక చాలు" అన్నాడు జగదేవుడు.

ముగ్గురూ భవనపు కొసకు వచ్చారు.

"పట్టుకోండి-పట్టుకోండి." రాయమురారి మరో కత్తిని చేత పట్టుకొని వారి వెంట పడ్డాడు. జగదేవుణ్ణి మోసుకుంటూ మల్లి దేవుడూ కుమార బ్రహ్మయ్యా పై నుండి తోటలోకి దూకారు.

కింద గుర్రం నిలబడి వుంది.

ముగ్గురూ గుర్రంపై పడగానే గుర్రం పరుగు పుచ్చుకుంది.

# 33

బిజ్జలుని హత్య జరిగిన గంటలోపలే అనుభవ మంటపం కార్య వర్గానికి రాత్రికి రాత్రే సమాచారం అందింది. కలకేతబ్రహ్మయ్య వచ్చి అందరినీ లేపి జరిగింది చెప్పాడు.

వెంటనే రహస్య సమావేశం ఏర్పాటు చేశారు.

"హంతకులు ముగ్గురని అనుకుంటున్నారు. అంటే జగదేవ, బ్రహ్మయ్య, మల్లిదేవులనే నా విశ్వాసం" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"వెళ్తూ వాళ్ళు బసవన్న నామం స్మరించడంలో అంతరార్థం?" అక్కనాగాంబిక ప్రశ్నించింది.

"ఇంకేముంది? నేరం మన మీదికి రావడం. దాని వల్ల మనకు, కాలచూరి ప్రభువులకూ యుద్ధం జరుగుతుంది. అప్పుడు తైలపుని అనుయాయులు తేలికగా కల్యాణ్ ఆక్రమించుకోవచ్చునని వారి వ్యూహం" అన్నాడు చెన్న బసవన్న. అది నిజమేనని అంతా ఆమోదించారు.

"ఇప్పుడు మన కర్తవ్యమేమిటి?" శివనాగుమయ్య ప్రశ్నించాడు.

"తెల్లవారితే పరిస్థితి తప్పకుండా విషమిస్తుంది. రాయమురారి మనలనందరినీ చిత్రవధ చేస్తాడు" అన్నాడు మడేలు మాచయ్య.

"మరణానికి భయపడతామా?" అన్నాడు చెన్నబసవన్న.

"కాదు-కాని నిష్కారణంగా శివ శరణుల రక్తం పారడం కూడా హింసయే అవుతుంది. అహింసను అహింసతోనే సాధించాలి.

రాజ్యంలోని లక్షలాది వీర శైవులను రేపటి నుండి ఏరి ఏరి చంపుతారు. నిజా నిజాలు తెలిపేందుకు మనకు అవకాశం కూడా ఉండదు" అన్నాడు మడేలు మాచయ్య.

"దాని కన్నా అనుభవ మంటపంలో మనం చేసిన చర్చలూ రచించిన గ్రంథాలూ బండ్ల కొద్దీ ఉన్నాయి. తెల్లవారితే వాటిని తగల బెడతారు పాలకులు" అన్నాడు అల్లమ ప్రభువు- అనుభవ మంటపం అధ్యక్షుడు.

"మరి, మన కర్తవ్యం ఏమిటో తక్షణమే నిర్ణయించండి" అన్నాడు చెన్నబసవన్న.

"విజయరామప్ప లోగడ మనకు సహాయం చేస్తానన్నాడు. అంతే కాక, కల్యాణ నగరం బయటి ప్రధాన ద్వారపాలకులు నా శిష్యులే! మరొక అర్థగంటలో మనం అనుభవ మంటప సాహిత్యాన్నంతా బండ్లకెత్తుకొని కల్యాణ నగరం దాటిపోవాలి" అన్నాడు మడేలు మాచయ్య. అందరూ దానికి అంగీకారం తెలిపారు.

ముందుగా మడేలు మాచయ్య పోయి విజయరామప్పతో మంతనాలాడాడు.

విజయరామప్ప అప్పటి కప్పుడే కావలసిన సహాయం చేశాడు.

కల్యాణ నగర ప్రధాన ద్వారాలు తెరుచుకున్నాయి.

అల్లమ ప్రభువు, అక్క నాగాంబిక, చెన్నబసవన్న, కలకేత బ్రహ్మయ్య, మడేలు మాచయ్య, శివనాగుమయ్య, ముగ్ధ సంగయ్య, మేదర చెన్నయ్య, దోహరకక్కయ, మోరిగ మారయ్య, ఆయన ధర్మపత్ని మొదలైన ప్రముఖులంతా తెల్లవారు జామువనే గుర్రపు బండ్లలో ప్రధాన ద్వారాలు దాటారు. ఉషస్తార పొడిచే వరకూ అలా వలస సాగుతూనే వుంది.

ఈ లోపల అంతఃపురంలో రాయమురారి అత్యవసర సమావేశం ఏర్పాటు చేశాడు.

"ఇది శివశరణులు చేసిన పనే కావచ్చు- నేరస్థులను ఏనుగులకు కట్టి చంపినందుకుగాను ప్రతీకారం తీర్చుకుని వుంటారు"

అన్నాడు కేశవపెద్ది. దానిని మాధవరాయడూ, విష్వక్సేనుడూ, మురారీ, వాసుదేవయ్యా బలపరిచారు.

"కల్యాణ నగరపు బయటి ప్రాకారద్వారాలు మూసివేయండి. కనపడ్డ ప్రతి శివశరణుడినీ నరికివేయండి, అనుభవమంటపాన్ని కూల్చివేయండి. అందులోని సాహిత్యాన్ని తగల బెట్టండి."

ఆజ్ఞాపించాడు రాయమురారి.

"చాళుక్యుల మీద కూడా నాకు అనుమానంగా వుంది" అన్నాడు సేనాధిపతి.

"సైన్యాన్ని సమాయత్తం చేయండి. స్వయంగా నేను నడుపుతాను. నాయనగారి మరణవార్త వినగానే, సోమేశ్వరుడు తన ప్రయత్నం చేయవచ్చు. అటు చాళుక్య సోమేశ్వరుడూ- ఇటు అనుభవమంటప చెన్నబసవన్న ఇద్దరూ నా ఖడ్గానికి ఉదయమే బలి కావాలి-

సైన్యాన్ని కోట కొమ్మల కెక్కించి సుదూర ప్రాంతాలలో సైనిక సంచలనం ఎక్కడన్నా కనపడుతున్నదేమో పరిశీలించండి" అన్నాడు రాయమురారి. అప్పటికి ఉషస్తార పొడిచింది___

కల్యాణ నగర ప్రాకారపు తలుపులు మూసి వేయబడ్డాయి.

రహస్యభటులు పరుగెత్తుకొని వచ్చి 'యువరాజా! అనుభవ మంటప సభ్యుడెవడూ కనపడటం లేదు. కోట కొమ్మల నుంచి చూచిన వారికి నగరానికి కొన్ని యోజనాల దూరంలో బండ్లూ, వాటి వెంట మనుష్యులూ పశ్చిమంగా సొన్నలిగె (షోలాపూర్) ముఖంగా పోతున్నట్లు కన్పడింది" అని చెప్పారు.

"అప్పుడే తప్పించుకున్నారన్న మాట! సైనికులారా! వెంబడించండి- బండ్లను తగలబెట్టండి. దొరికిన వారినల్లా నరికివేయండి."

రాయమురారి ఆజ్ఞాపించాడు.

ఒక సైన్యాధికారిని పిలిచి కొంత సైన్యాన్ని భైరవుని కోన వైపుకు పంపాడు.

ఏనుగులూ గుర్రాలూ రథాలూ ఎక్కి సైన్యం బయలుదేరింది. సూర్యోదయమైంది.

తాటాకు పుస్తకాల బండ్లతో వేలాది శివశరణులు పోతున్నట్లు సైనికులు గుర్తించారు.

వెంట పడ్డారు.

"ఏమిటి కర్తవ్యం? సైన్యం తరుముకు వస్తున్నది" అన్నాడు మడేలు మాచయ్య.

"'అయ్యా! మా తప్పేమీ లేదు. బిజ్జలుణ్ణి ఎవరు చంపారో మాకు తెలియదు' అని వారికి విన్నవిస్తే ఒక్క మాటతో సరిపోతుం దిగా?" ముగ్ధ సంగయ్య సలహా యిచ్చాడు- కలకేత బ్రహ్మయ్యకు.

వారిద్దరూ ఒక గుర్రం మీద పోతున్నారు.

"ఈ లోపలే నిన్నూ, నన్నూ సైన్యం చంపి వేస్తుంది. మన సాహిత్యాన్నంతా తగల బెడుతుంది" అన్నాడు కలకేత బ్రహ్మయ్య.

"అమ్మో! అయితే త్వరగా పారిపోవాలి" అన్నాడు ముగ్ధ సంగయ్య!

అప్పుడు చెన్నబసవన్న యిలా చెప్పాడు-

"ఇప్పుడిక యుద్ధం తప్పని సరి! మన ప్రాణాలను రక్షించు కోవడం కోసం కాదు- రాబోయే తరాలకు మన సాహిత్యాన్ని సుర క్షితంగా అందివ్వడం కోసం. అమ్మా! నీవీ సాహిత్యాన్ని సురక్షితంగా సొన్నలిగె లోని సిద్ధ రామేశ్వర మఠానికి చేర్చు. అక్కడికి కాల చూరి సైనికులు అడుగు పెట్టలేరు.

మాచయ్యా! నీవు సాధ్యమైనంత వేగంగా సొన్నలిగె పోయి సిద్ధ రామేశ్వర శివయోగితో చెప్పి కొన్ని సైనిక పటాలాలు రాజు నడిగి తెప్పించు! బ్రహ్మయ్యా! నీవు ముగ్ధసంగయ్యను తాటాకు పుస్తకాల బండిలో పడేసి, అరణ్య మార్గం నుండి కృష్ణా నదీ తీరానికి వెళ్ళు-కూడల సంగమేశ్వరం చేరి బసవన్నగారికీ వార్తలన్నీ అందించు!

నేను ఇక్కడ నిలబడి సైన్యాన్ని ఎదిరిస్తాను-నిరోధిస్తాను. ఈ లోపల బండ్లు మరికొన్ని యోజనాల దూరం సాగిపోగలవు." అన్నాడు.

అయితే చెన్నబసవన్నను ఒంటరిగా వదిలేందుకు మడేలు మాచయ్య అంగీకరించలేదు.

"నేనూ నీకు అండగా నిలిచి యథాశక్తి పోరాడుతాను. కాల చూరి సైనికులను చంపవద్దు-కాని నిరోధిద్దాము" అన్నాడు మాచయ్య.

వేలాది శివశరణులు క్షణంలో యుద్ధానికి సిద్ధమైనారు.

భస్మాలూ, రుద్రాక్షలూ ధరించి త్రిశూలాలు చేతబట్టారు.

ఎదురుగా వస్తున్న కాలచూరి సైనిక పటాలాలు నివ్వెరపోయి క్షణకాలం నిలబడి పోయాయి.

వారు చెన్నబసవన్న పై యుద్ధం చేయడానికి సుముఖంగా లేరు. కాని జైనులు, శైవేతరులు మాత్రం ముందుకు దూకారు. యుద్ధం ప్రారంభమైంది. వారు విసిరిన బాణాలకు చెన్నబసవన్న సైన్యం నేల కొరుగుతున్నది.

రాయమురారి సైన్యం ఇంకా ముందుకు విజృంభించింది.

ఒక జైన సైనికుడు నూనెలో ముంచి అంటించిన కాగడాను బాణానికి తగిలించి విడిచాడు.

కాగడా వెళ్ళి ఒక బండికి అంటుకున్నది.

ఆ బండిలో శైవ సిద్ధాంత గ్రంథాలూ, పంచాచార్యులు వ్రాసిన వ్యాఖ్యానాలు, అల్లమ ప్రభువు-'గుహేశ్వరా' అనేమకుటంతో వ్రాసిన గీతాలు, అక్క మహాదేవి 'చెన్న మల్లికార్జునా' అనేమకుటంతో వ్రాసిన వచనాలు, బసవేశ్వరుడు రచించిన నాలుగు లక్షల అరవై నాలుగు వేల గీతాలు అందులో ఉన్నాయి. సాహిత్యానికి నిప్పంటుకునే సరికి చెన్నబసవన్న యుద్ధ రంగంలో వీర విహారం చేశాడు. బసవన్న వీరావేశం చూచి 'చంపకుండా చావకుండా శత్రువులను నిరోధిస్తూ విజృంభించు చెన్నబసవన్నా' అన్నాడు మడేలుమాచయ్య.

అయితే కాలచూరిసైన్యంలోని శైవులకు మతావేశంవచ్చింది.
వారు తమ సైన్యంలోని జైనుల మీద తిరగబడ్డారు.
యుద్ధ రంగం పీనుగు పెంట అయింది.
నిప్పంటుకున్న బండిని అతికష్టంతో ఆర్పారు.

సాహిత్యాన్ని తరలించుకుంటూ అక్క నాగాంబిక సాగి పోయింది.

# 31

కలకేతబ్రహ్మయ్య శ్రమించి, అరణ్య మార్గం నుండి పయనించి, కృష్ణా-మల ప్రభానదీ సంగమంలో ఉన్న సంగమేశ్వర క్షేత్రానికి చేరాడు.

వైశాఖ శుద్ధ విదియ.

బ్రహ్మయ్య సంగమేశ్వర దేవాలయం వద్దకు చేరేసరికి బాగా చీకటి పడింది.

నెలపొడుపు కనపడింది. అప్పుడు గుర్తుకు వచ్చింది- ఆనాడు బసవన్న జన్మదినమని. త్వరత్వరగా మందిరం వద్దకు పోయాడు.

అక్కడ వేలాది భక్తులు గుమిగూడి వున్నారు.

అందరి ముఖాలు గంభీరంగా ఉన్నాయి.

"ఓం త్ర్యంబకాయ త్రిపురాంతాయ, కాలాగ్ని రుద్రాయ నీల కంఠాయ నమః ఓం" అంతా సంకీర్తనంలో మునిగివున్నారు.

బ్రహ్మయ్య రాకను ఎవరూ గుర్తించలేదు. ఆలయ పూజారి మహదేవయ్య మాత్రం కలకేతబ్రహ్మయ్యను గుర్తు పట్టాడు.

లేచి జనం మధ్యనుండి ఇవతలికి వచ్చాడు.

"బ్రహ్మయ్యా...." అన్నాడు ఆర్ద్రంగా.

"మహదేవయ్యగారా! శరణు- శరణు. అత్యవసరంగా బసవన్నగారిని కలవాలి. ఎక్కడున్నారు వారు?"

కలకేతబ్రహ్మయ్య చేతిని పట్టుకొని, మహదేవయ్య 'పద' అని, వెంట బెట్టుకొని నదీతీరానికి తీసుకు వెళ్ళాడు.

కలకేతబ్రహ్మయ్య దారిలో జరిగిన సంగతులు వివరంగా చెప్పాడు.

"త్వరగా నేను బసవన్నగారిని కలుసుకోవాలి" అన్నాడు బ్రహ్మయ్య.

అప్పుడు మహదేవయ్య ఇలా చెప్పాడు-

"నిన్న రాత్రి బసవన్నగారికొక స్వప్నం వచ్చింది. అందులో

కల్యాణ్‌లో విప్లవం పుట్టినట్లూ, శివశరణులను ప్రభువు హిం
న్నట్లూ కనపడిందట.

నేటి ఉదయం బసవన్నగారు మామూలుగానే లేచారు. స్నాన జపధ్యానాదులు నిర్వహించారు. లింగ జంగ మార్చనలు జరిపారు.

పూజా ప్రసూనాలు తలలో దాల్చి తీర్థ ప్రసాదాలు స్వీకరించారు- నన్ను పిలిచారు! నేను వినయంగా దగ్గరికి పోయాను.

"మహదేవయ్యా! నీవు ధన్యుడివి. నిరంతరం సంగమేశ్వరుని పాదసేవలో ఉండటం ఎంత భాగ్యం?" అన్నాడు.

అప్పుడు నేను "బసవన్నా! నేను గంగానదిలో నున్న తాబేలును. తాబేటి చిప్పకు ఎన్ని నీళ్ళు అంటినా దానికి పావిత్ర్యమూ లేదు-మోక్షమూ రాదు" అన్నాను.

బసవన్న చిరునవ్వు నవ్వి "అది నీ వినయానికి నిదర్శనం మహదేవయ్యా! నిన్న రాత్రి నాకొక స్వప్నం వచ్చింది. అందులో కల్యాణ నగరంలో వింతలు పుట్టినట్లు అనిపించింది- సామాన్యంగా నా కలలు కల్లలు కావు మహదేవయ్యా.

కల్యాణ్‌నుండి ఏమి చెడువార్తలు వింటానో ఏమో! అవి వినకుండానే పోతే బాగుండును" అన్నారాయన.

"బసవన్నా! నేడు నీ జన్మదినం. నీవే మా ప్రాణానివి. నీవు మా ఉద్యమానివి. నీవు లేకుంటే మా జీవితాలుండవు" అన్నాను నేను.

బసవన్న వెంటనే నా పాదాలకు శరణు చేశాడు. "నీ అభిమానానికి కృతజ్ఞుణ్ణి మహదేవయ్యా! కాని నేను వచ్చిన పని అయిపోయింది.

శివుడు చెప్పిన పనులన్నీ చేశాను నేను. బిజ్జలుణ్ణి ఎవరైనా నిందిస్తారేమో తప్పు సుమా! అతడూ శివదూతయే! బిజ్జలుడే ఈ పరీక్షలు పెట్టకపోతే భక్తుల శక్తీ, త్యాగమూ లోకానికి ఎలా తెలిసేది?

ఒరిపిడి రాయి లేకుండా బంగారానికి విలువ కట్టడం ఎలా మహదేవయ్యా!

అందుకని బిజ్జలుణ్ణి కూడా నేను ఆత్మ బంధువుగానే ప్రేమిస్తాను" అన్నాడు బసవన్న.

"కత్తులు విరిగిపోతాయి. ద్వేషాగ్నులు ఆరిపోతాయి-ప్రేమ, కత్తికి బదులు సింహాసనమెక్కి రాజ్యమేలుతుంది. త్యాగం మేఘంగా మారి వర్షించి శాంతి సస్యాలను మొలకెత్తిస్తుంది. ఆ శుభసమయం భవిష్యత్తులో వస్తుంది మహాదేవయ్యా!" అన్నాడు బసవన్న.

అంతే!!

దినమంతా ఇక ఏమీ ఆహారం స్వీకరించలేదు. సాయంత్రం సంగమేశ్వరుని మందిరంలోకి పోయి స్వామితో ఏకాంతంగా ఏమిటో మాట్లాడాడు. ఆ తర్వాత నదీ సంగమ ప్రదేశానికి స్నానానికి పోయాడు-

అంతే!!

ఎంతకూ రాకపోయేసరికి నదీతీరానికి వెళ్ళాము మేము.

నది ఒడ్డున ఇసుక తిన్నెలపై ఆయన ఉత్తరీయమూ, పాదుకలూ ఉన్నాయి.

బసవన్న....నదిలో....లీనమైనాడు.

సంగమేశ్వరుణ్ణి చేరుకున్నాడు."

కలకేతబ్రహ్మయ్య చీకట్లో కూడా, మహాదేవయ్య కన్నీటిని పోల్చుకున్నాడు.

నిలుచున్న వాడు నిలుచున్నట్లే నేలమీద పడిపోయాడు బ్రహ్మయ్య-

'బసవా!' అని పెద్దగా కేక పెట్టాడు.

'వృషభా' అని, అది ఆకాశంలో ప్రతిధ్వనించింది.

"జయ జయ బసవేశా సత్య సద్భక్తివాసా!
జయ జయ శివశివగోత్రా సత్ప్రసాదైక పాత్రా!
జయ జయ భవదూరా శాశ్వతైకాంగ వీరా!
జయ జయ బసవాఖ్యా సంవిదాశ్చర్య సౌఖ్యా!"

సంగమేశ్వర మందిరం నుండి సంకీర్తనం వినపడుతూ వుంది!

* * *

ఆ తర్వాత చరిత్రలో చాలా కథ జరిగింది. కానీ దానినం వివరంగా వర్ణిస్తూ పాఠకులకు చెప్పాలనే కోరిక నాకు లేదు.

రాయమురారి చాళుక్య సైన్యంతో యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో సోమేశ్వరుడూ, మల్లదేవుడూ, కుమారబ్రహ్మయ్యా, నిహతులైనారు.

అయితే ఈ కల్లోలాల ఫలితంగా కల్యాణ నగరం తన శోభను కోల్పోయింది.

రాయమురారి ఆజ్ఞాపించడమే ఆలస్యం జైనులూ, భవి సమూహమూ వెళ్ళి అనుభవమంటపాన్ని పడగొట్టారు.

దొరికిన శైవుడిని పట్టుకొని చిత్రవధ చేశారు. ఆ తర్వాత పట్టం కట్టుకొని, రాయమురారి కొడికట్టిన దీపంవంటి కాలచూరి రాజ్యాన్ని కొంత కాలం పరిపాలించాడు. అహింసా యుద్ధం చేస్తూ, సాహిత్యాన్ని కాపాడుకుంటూ, సైనికుల నెదుర్కొంటూ, యుద్ధ రంగలోనే చెన్నబసవన్న, మడేలు మాచయ్యా- ఇతర వీరులూ నేల కొరిగారు. అక్కనాగాంబిక అతికష్టం మీద, తగులబెట్టబడగా మిగిలిన సాహిత్యాన్ని సొన్నలిగెలోని సిద్ధరామేశ్వర మఠానికి చేర్చింది.

వనపురి (నేటి వనపర్తి- మహబూబ్ నగర్ జిల్లా)లో ఉండగానే మల్లికార్జున పండితారాధ్యునికి కల్యాణ విప్లవవార్తలూ, బసవన్న లింగైక్యం చెందడం తెలియవచ్చి విలపించాడు.

బసవన్నను దర్శించుకోలేక పోయాక, ఇక జీవిత మెందుకని విరక్తితో అటు నుండి శ్రీశైలం వెళ్ళి అక్కడ తనువు చాలించాడు.

ఇక ఈ కథ సుఖాంతమో, విషాదాంతమో, నిర్ణయించుకో వలసిన బాధ్యత పాఠకులకే వదిలి, ఇంతటితో ముగిస్తున్నాను. కాని ఒక మాట-

వేలాది వ్యక్తులు తమ శరీరాలను ఇటుకలుగా పేర్చి త్యాగ మయమైన, ఆదర్శ భావభవనం నిర్మించి మానవాళికి శాశ్వతంగా ఇచ్చినప్పుడు, వారి బలిదానం విషాదాంతమా? అనుభవ మంటపం ఒకనాడు కట్టబడ్డ- మరొకనాడు పడగొట్టబడ్డ- రాతికట్టడమా??

విశ్వప్రేమకు కేవలం అదొక సంకేతమే కదా!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

—:సమాప్తం:—

# GREETINGS

*B Gopala Reddi*

Phone: 4
'SUDARSHANA MAHAL'
NELLORE.

Camp: Hyderabad
April 28, 1978.

Lord Basaveswara is one of the great religious reformers who influenced several centuries, basides founding Lingayat Sect. He advocated the classless society and carried crusade against untouchibility. He also advocated 'Ahimsa' and pleaded for 'Vegitarianism'. Both in Karnataka and in Andhra he has several followers. Dr. Mudigonda Sivaprasad is trying to ~~catch~~ capture the spirit of his teachings and revolutionary activities in the form of a novel entitled 'ABHINAVA MANDAPAM'. Dr. Sivaprasad is a scholar with a racy style in Telugu prose. In view of the importance of the subject, I wish the novel every success. May the dreams of Basaveswara, where cast distinctions are removed become a reality and may the curse of 'Untouchability' be wiped out erlong.

B. Gopala Reddi

( B. GOPALA REDDI)

# సాహిత్య ఎకాడమీ అధ్యక్షులు

## డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి

## ఆంగ్ల లేఖకు అనువాదం

డాక్టర్. బి. గోపాలరెడ్డి. ఫోన్. 4

సుదర్శన మహల్, నెల్లూరు.

(క్యాంప్: హైద్రాబాద్
28, ఏప్రిల్, 1978)

అనేక శతాబ్దాలను ప్రభావితం చేస్తున్న గొప్ప మత సంస్క ర్తలలో మహాత్మా బసవేశ్వరుడు ఒకరు. వీర శైవమతాన్ని స్థాపి చడంతో బాటు, వర్గ రహిత సమాజాన్ని ప్రబోధించి అస్పృశ్యతక వ్యతిరేకంగా పోరాడాడు. అహింసను శాకాహారాన్ని ప్రచార చేశాడు. ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలలో ఆయనకు ఎందరో అను యాయులు ఉన్నారు.

డా॥ ముదిగొండ శివప్రసాద్, బసవేశ్వరుని బోధలను, విప్ల వాత్మక సంస్కరణాత్మక హృదయాన్ని ఆకళించుకొని "అనుభవ మంటపం" నవల ద్వారా ప్రకటిస్తున్నారు. డా॥ శివప్రసాద్ తెలుగు వచన రచనలలో భావోద్రేక శైలిగల విద్వాంసుడు. ఈ కథకుగల ప్రాముఖ్యం దృష్ట్యా, ఈ నవల అన్ని విధాలా విజయవంతం కావా లని కోరుకుంటున్నాను. శాశ్వతంగా కులవ్యత్యాసాలు, అస్పృశ్యత నిర్మూలింపబడి బసవన్న కన్న కలలు ఫలించాలని ఆశిస్తున్నాను.

(సం.) బి. గోపాలరెడ్డి

272



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M136 |
| పుస్తకం పేరు | విజయ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1 to 76 |
| తయారు చేసేవది | sowmya |
| పేజీలు విడదీసివది | sowmya |
| స్కాన్ చేసినది | ch.Ramya |
| పరీక్ష చేసేవది | HASEEMA |
| పేజీలు సరిచూసివది | |
| బైండింగు చేసేవది | |
| ప్యాకింగు చేసేవది | |
| పరిస్థితి | good |